# ఈనాటకమునవచ్చు పాత్రల వివరము



## పు రు షు లు.

1 రాముడు
2 అష్టావక్రుడు
3 లక్ష్మణుడు
4 భద్రుడు
5 వాల్మీకి
6 కుశుడు
7 లవుడు
8 భరతుడు
9 శత్రుఘ్నుడు
10 వశిష్టుడు
11 ఈశ్వరుడు
12 బ్రహ్మ
13 భటుడు
14 ఆంజనేయులు
15 మహాంకాళిగాడు
16 నూకాలుగాడు
17 వాల్మీకి శిష్యుడు
18 రుచికుడు

## స్త్రీ లు.

1 వియోగదేవత
2 సీత
3 కళిక
4 కృష్ణవేణి

# లవకుశ.



## ప్రథమాంకము



రంగము—పుష్పోద్యానము.

(సీతారాములు ప్రవేశించెదరు)

రాము—దేవీ! జానకీ! దానివైపు జూడుమా!

చ. కలయఁగబూచి కొట్టకొనఁ ♦ గ్రాలెడు కోకిలతోడ నొప్పి వ
ర్తులమగు గున్నమావియదె ♦ తోఁచెడుగాంచితె! మీఁద జందనం
జలదిన చైత్రలక్ష్మికుచ ♦ మట్టులమించుచునుండె నద్దిరా
జలజభవప్రకల్పిత ని ♦ సర్గమనోహర మెంచశక్యమే.

సీత—ప్రాణేశ్వరా! మీచేతఁ జక్కఁగ వర్ణింపబడిన మీవన లక్ష్మి గర్భవతిసుఁడీ.

రాము—ఔనది సత్యమే. కోకిలాంగన వృక్షశిఖరాగ్రమున నుండుటచే నేనాసార్థక్యమును వ్యక్తీకరింపలేకపోయితిని. గర్భవతివగుటచే స్వానుభవము గనుక నీకాయూహ చప్పున స్ఫురించినది. గర్భిణీ స్త్రీల కది లక్షణమేకదా.

సీత—ప్రాణేశ్వరా! నేనట్టిఫలమును గాంచినపిమ్మటగదా యానందింపవలసినది.

రాము—ప్రియురాలా! దైవమే యనుగ్రహింపగలఁడు. (చల్ల గాలి సుఖము ననుభవించి) ఆహా! దేవీ! యీగంధవహుఁడు మంగళాశంసనమును జేయుచున్నాఁడుసుమీ.

చ. విరిసిన పుష్పకుంజరుల ♦ విశ్రుత సౌరభమాని యానిపు
ష్కరిణుల శీకరంబులను ♦ చక్కఁగఁగ్గొనిమించి సౌఖ్యసం

భరితమెలర్పగా మలయ ♦ మారుతుడల్లన వీచుచుఁ శుభం
కరమగు నీమనోరథము ♦ నన్ శకునంబును దీర్చెఁగంటివే.

సీత—ప్రాణేశ్వరా! నేనిదివఱకు నేక కష్టముల నలసియున్న దాన నగుటచే నాకీ శకునంబులన నమ్మకము లేదు. ఏమందురా!

చ. అడవుల కేఁగునాఁడు మరు ♦ దాగమనంబు సుసౌఖ్యమంచు బెం
పడగి ప్రదక్షిణార్చ్యుల వహ ♦ తాశనుఁడున్వెలుగొందె నాపదల్
తొడరవటంచు నెంచితిని ♦ దుష్టుఁడు రావణుచేతఁజిక్కి యా
వడువున గష్టముల్పడమె, ♦ బ్రహ్మ వినిర్ణయ మెట్లుతప్పునో.

రాము—సాధ్వీ! అది మనకు సుశకునమే. యేమందువా?

కం. మనకార్యము రాక్షసనం
హనంబై నందువలన ♦ నటుజరిగెఁగదా
వనితా! మనమాతరి కా
ననకష్టము బడకవచ్చు ♦ నా! సుకృతంబుల్.

సీత—ఔ నది నిజమే. ఆయంశము నటుంచుఁడు.

గీ. పరభృతంబులు హాయిగాఁ ♦ బాడుచుండ
నృతుల వేయుచు ఘనలనం ♦ తతులు దిరుఁగ
నరుల సిగ్గులగల్పింప ♦ నగకులంబు
జెలఁగి విహరింత మీవన ♦ సీమలందు.

రాము—అటులే చేయుదము రమ్ము. ప్రేయసీ! యీ ప్రేలు చున్న పూగుత్తిని విరచి నీకుచబంధము నలంకరింతునా!

సీత—వద్దు. వద్దు. నాకు బ్రియమైన యీగుళుచ్ఛమును విర చిన మీచేత నాసికను గోయించుకొనిన శూర్పణఖవలె మనలతామ తల్లికగూడ శోభావిహీనయగునుకదా! అందువలన నాయానందమునకు గొంతభంగము కలుగును.

రాము—అది నిజమే. అటులైన వేరొక పుష్పమును నీతురు మునఁ దురిమెదను. (అట్లుచేసి) ప్రియురాలా! నీవిప్పుడు కేవలము వసంత లక్ష్మివలె నొప్పుచున్నావు సుమీ!

## ప్రథమాంకము.

సీత—ప్రాణేశ్వరా !

గీ. నయనపుష్పంబులును ముఖ ♦ నళినమలర
నీలమేఘచ్ఛవులతోడఁ ♦ గ్రాలుమీరు
కేవలము చైత్రరూపంబు ♦ తో వెలయఁగ
నేనిక వసంతలక్ష్మినా ♦ యేమియరుదు.

రాము—ప్రేయసీ.! అదియు నిజమేకాని

గీ. బలమధికమాటచే బెక్కు ♦ తలలు కల్గి
ముదము గొల్పెడు నీమజ్జి ♦ మొక్కగనుమ
నాడు నీవు లిఖింపగ ♦ గోడనున్న
నూఱుతలలనుగల రావ ♦ ణుని విధమున.

సీత—(రోషముతో, రామునిజూచి తలవంచి యూరకొనును)

రాము—ప్రేయసీ ! ఏమి పలుకవు ? (మోమెత్తును.)

సీత—(చేయి తీసివైచును.)

రాము—దేవీ ! కోపమువచ్చినదా ?

సీత—శరీరమును దహించుమాటలకుఁ గోపమేల ?

రాము—చెలీ ! యిందు నీకుఁ గోపము రావలసిన యవసరము లేదు. అనేకశీర్షయగుటచే నీమజ్జిమొక్క నట్లు పోల్చితిని.

సీత—ఆర్యా !

ఉ. మాయలమారికైక బ్రతి ♦ మాలి దశాస్యునిరూపు గోడపై
వ్రాయఁగదమ్మ చూతునని ♦ ప్రార్థనసేయగ నేనెఱుంగన
మ్మాయని వాని వ్రేలొకటి ♦ మాత్రము వ్రాసితినంత నాపెత
త్కాయముఁ బూర్తిచేసెనది ♦ తప్పుగ నన్నిటులాడఁజెల్లునే.

రాము—ప్రాణసఖీ ! ఆశతకంఠరావణుని కైక వ్రాసినదనియెరుంగనా ! ప్రాణమువచ్చి మరల విజృంభించిన నాశతకంఠుని నీవు త్రుంచుట నెరుంగనా ! కోపగింపకుము.

కం. పరిహాసం బొనరించితిఁ
దరుణీ! నీకింతకిన్క ♦ దగునే నాపై
గరుణింపు మెట్టులైనను
చురచురమను చూడ్కికోల ♦ జొన్పగతగునా!

సీత—దేవా! అరణ్యాసక ప్రియ!

గీ. మాటిమాటికి మేలంపు ♦ మాటలాడి
నన్ను నుడికించుచుందువు ♦ న్యాయమగునె
హృదయమెట్లున్నఁ బై మాట ♦ లీవిధమునఁ
బలుక నభిమానముండదే ♦ పడతి కెపుడు.

రాము—ప్రియురాల! నేనీవిషయమునసపచారమునే చేసితిని.

ఉ. నీమృదుబాహుపాశముల ♦ నిర్దయతన్ ననుగట్టివైచి కాం
చీమణిచేత నాయొడలు ♦ ఛిద్రముకానటుగొట్టి పంపుమా
భామిని, యెన్నడిట్టి బుజు ♦ వాక్యములాడెదు వాడఁగాను నీ
మోమునువిచ్చిచూచి నను ♦ ముచ్చటదీరగ నేలుకోగదే.

సీత—ఓ స్వకార్యధురంధరా! రామచంద్రా!

చ. అవసరమైనచోఁ బురుషు ♦ లాత్మల నెన్నడులేని ప్రేమలన్
దవులగఁజేసికొంచు నెల ♦ తా! యిక నాబ్రతుకెల్ల నీవెకా
వవే! యని వేడుచుందురట ♦ పైని కృతార్థతఁజెంది కాంతలన్
లవమును ప్రేమనెంచక ♦ గులాములపోలిక జూచువారెకా!

కావున మీమాటల కెవ్వరు సంతసింతురు?

రాము—ప్రియురాలా! అంతమాత్రమున కింతకోపమా! పోనిమ్ము. తప్పేచేసితినిగాక.

ఉ. తప్పుక్షమింపుమంటి నెగ ♦ తాళికి నీగతి నంటినంటి ని
న్నిప్పుడు నీవిధాన వచి ♦ యింపను నెమ్మదిసైపు మంటి నో
కప్పురగంధి, యీస్మర వి ♦ కారము నోరువ మోముదామరన్
విప్పి మనోరథంబును ల ♦ భింపగఁ జేయవె పుష్పశయ్యలన్.

కావున సుప్రసన్నురాలవుకమ్ము. నాజనని కౌసల్యాదేవియు మాసోదరి శాంతయు దాము సవనమహోత్సవమునకై పోవునప్పుడు గర్భవతియైన జానకి యేదికోరిన నాయమ యభీష్టమును దీర్పుమనిజెప్పి నారు. కావున నీయభీష్టమును దెలిపెదవేని నెరవేర్చెదను.

సీత—ప్రాణేశ్వరా! మీవంటి మహాత్మునకిల్లాలనైన నాయభీష్టములకు గొఱంతయుండునా? మీచరణసేవతప్ప నాకు వేరుకోరికయే లేదు.

రాము—అది సరియే. గర్భవతులకు గాంక్షలుమెండు. అదిగాక వేరుకోరికయున్న దెలుపుము.

సీత—జీవితేశ్వరా! ప్రాయమువచ్చినదాది మునిపత్నులతో సహవాసముచేసి యుండుటచే మరల వారితో గొన్నిదినములు ముచ్చటగా గాలముఁ గడుపవలెననియున్నది. అంతకుమించి వేరుకోరికలేదు.

రాము—జీవితేశ్వరీ! అందులకు సందియమేమి? అట్లే నీకోర్కె నెరవేర్చెదరమ్ము. కొంతసేపు కేళాకుళినిజేరి విహరించి పిమ్మటఁ బురిలోనికిఁ బోవుదము.

(ఇద్దరును నిష్క్రమించెదరు.)

---

## 2 వ రంగము—పుష్పోపవనప్రాంతము.

వియోగదేవత—(ప్రవేశించి) జంతుహింసఁజేసి బ్రతుకవలసిన సింహవ్యాఘ్రాదులకు గోరలుంచినటులే వియోగమును కలుగజేసి, యందువలన సతీపతులకు గలిగిన శోకరసమును ద్రావుచు బ్రతుకవలసిన నాకు సంకల్పసిద్ధియగునరంబొకటిపరమేశ్వరుఁడు ప్రసాదించియున్నాడు అందుచే నాపట్టినదెల్ల బంగారమును ముట్టినదెల్లముత్యమునగుచున్నది. సంయోగదేవతయైన నాచెల్లెలు వియోగదేవతనైన నేను చెప్పిన చొప్పున నడచుచుండవలయును. కావున నేతలంచుకొనిన నెంత ప్రేమాస్పదముగల దంపతులనైన నెడబాపి చెరియొకయూరను బడవైచి

మిక్కిలి యేడ్పించుచుండును. అప్పుడుకాని నాయాకలితీరదు. నిరంతరము కన్నీళ్ళవల్లనే నేనుజీవింతును, కాని నాకు వేరుతిండిలేదుకదా ! మాచెల్లెలు సంయోగదేవత తలంచికొనిన నెట్టిదుస్సాధ్యమైన యంతఃపురములోనున్న యాడుదానినైనను గహనములలోనున్న మగవానితో గలుపగలదు. అంతమాత్రముననే యత్యంత ప్రేమను పూర్ణముగ నొప్పించుటకు కలదుకదా ! నాచెల్లెలికి విటకాడైన నలరాజు? అట్టి ప్రేమయవ్యాజమగుటతోడనే పెరుగుట విరుగుటకొరకే యని నే నాదంపతుల నావహించి వియోగమును కలుగఁజేసి యిరువుర నేడ్పించుచు నావైపునుండి మగవాని కన్నీళ్ళను యీవైపునుండి ఆడుదాని కన్నీళ్ళను ఆచేతా యీచేత యీచేతా ఆచేతా నంది పుచ్చుకొనుచు నొక్కమక్కయైన క్రిందబడకుండ త్రాగుచుండెదను కాని మధ్యమధ్య పరుల యుచ్ఛస్థితిగాంచి యోర్వలేనితుంటరులు మాకేల నమ్మాయని యేడ్చుచుండ జాలిదలచి వీరలకును యిదే బ్రతుకుగదా యనిమెంచి నాలుగేసి కన్నీళ్ళచుక్కలా దేవిరికొట్టుముండకొడుకుల మొగానబార వైచుచుందును. సీతారాములకామధ్య వియోగమును గలుగజేసి పదునాలుగేడు లందరిని యేడ్పించి హాయిగా బ్రతికినాను. సీతారాములేకమైన తరువాత మగలుచచ్చిన రాక్షసాంగనలకన్నీళ్ళు కొన్నాళ్ళు త్రాగితిని కాని ఆమొండిముండ లాయేడ్పునుగూడమాని చావగామిగిలిన చచ్చువెధవలుతోగూడి సుఖపడుచున్నారు. ఇక నేనెట్లు బ్రతికెదనురా యని యాలోచించి పరమనీచులకన్నీళ్లు త్రాగుట కాపోవక సీతారాముల యేడ్పించి బ్రతుకదలచి యామధ్యనొకనాడు రావణునిరూపమును గోడపై వ్రాయుదునని కైకచే నడిగించితిని. కాని యాజానకి వాని చరణాంగుష్టముతప్ప నాతడెట్లుండునో యెరుంగనని కాలివ్రేలు మాత్రమే వ్రాసినది. తరువాత నాప్రభావమువలన గైకచే దక్కిన రూపమును బూర్తిచేయించితిని. అంతనారాముడువచ్చి యిదేమన నీభార్య రావణునిరూపము నట్లు వ్రాసినదనియు వానిపై మనసు తగిలె

నేమోయనియు గైకచే బలికించితిని. తరువాత నా ప్రతిమ నా ప్రభావమువలన బ్రాణముకలిగి రామునిపై విజృంభింప రాము డాశ్చర్యపడి సీతనడుగ మహాత్మా! నేనేపాప మెరుంగననియె. అంత శ్రీరాముడు అటులైన నీవే వానిని వధింపుమన రామునిచేతిశరశరాసనములనందికొని యాశతకంఠరావణునిసంహారించి స్వామీ కైకమాంబరావణావతారము గోడపై వ్రాయుమన వానికాలివ్రేలుతప్ప నేనన్యమెరుంగనని అంతియే వ్రాసితిని. కైకమాంబ తరువాత ఆకారము వ్రాసినదట. ప్రాణమెట్లు వచ్చెనో నాకుదెలియదు. అంగుష్టమున వ్రాసిన నపచారమును మన్నింపుడని ప్రార్థింప రాము డిష్టపడెను. అందుచే వారినివిడదీయుట కప్పుడనువుపడినదికాదు. కానియెట్లయినను నారొట్టెవిరిగి నేతిదొప్పలో బడినది. ఏమందురా? అసురుల కభయం బొసంగిన భృగుపత్నిని నారాయణుండు శిరచ్ఛేదముజేసి దనుజుల దునుమాడెను. అందుపై భృగువు కోపించి నిర్దాక్షిణ్యంబున నాపత్నినిజంపి నాకు భార్యావియోగదశ కలిగించితివి కావున నీవును భార్యావియోగదశ ననుభవించుమని విష్ణుని శపించెను. ఆవిష్ణువే యిపుడు రాక్షససంహారణార్థమై రాముడై పుట్టినాడు. కనుక యరణ్యావాసవియోగదశకాక మరలభార్యవియోగదుఃఖము రాము డనుభవింపవలసియున్నది, కావున జానకిపై నపవాదమును జనులలో విస్తరింపజేసి రామునినుండి సీతనెడబాపి వనములపాలుజేసి యిద్దరినేడ్పించి వారివారి కన్నీళ్ళకాలువలలో జలకమాడుచు హాయిగాద్రాగుచు బ్రతుకుదానను. నేనికపోయి సీతపై నపవాదమును విస్తరింపజేసెదను గాక.

(నిష్క్రమించును.)



# లవకుశ.

## ద్వితీయాంకము

రంగము—అయోధ్యాపురవీధి.

(కళికయను చాకలిది ప్రవేశించును.)

కళిక—నాగహసారం కాకపోతె! అపొగరబోతుకాపోడు మా గాడిద కాళ్లిరగ్గొట్టాలా! యీమైలగుడ్డలమూటలన్నీ నానెత్తిమీద మడాలా!ఎక్కడకాపోడి వొంగసేను? ఎక్కడ మాసాకలోళ్ల గాడిదలు మేసేసోటు? మాగాడిదెల్లి ఒంగసేను మేసిందంట! కాయిడిబద్ద తీసికొని కాలిరగమొడిశాడంట. అదిమొద లీదిలోని మైలగుడ్డల మూటలు మోయలేక నచ్చిపోతున్నానుగందా మారాజా! అది సరిగందా, కూంతాలస్నమైతే మారాజా నామొగుడు దుడ్డుకర్రతీసుకొని సోడిదంటుబాదినట్టునచ్చేసావు బతికేబతుకూ యెరకుండా బాత్తాడు గందా! యింక మాఅత్తముండ నూరుచుందిని నులిమిన నూకాలమ్మే. అబద్దంలేదు. ఆయమ్మ కతిమేహోని కామోలు కాళ్ళురెండూపడిమోయినాయి. లేకుంటే రాజా! నన్ను సీపురుకట్టదెబ్బలు కొట్టకుండా వూరుకోనేదేనా. ఆజాంకారము ఆపెతాపము ఆపెత్తనము ఆహోరు ఆగబగబయేమారాణికై నావున్నదా! ఆఅగ్గికాడ నోనుకాగా కాపురం చేస్తున్నాగాని మరోత్తైసచ్చిపోదూ! నోనేమన్నా అంటే నాపతివ్రతా దరమానికి లోటగుతాదని నోరుమూసుకొంటాను. ఓలమ్మోనోనొచ్చి సాలాసేస్పైంది. నోనెర్రగానుంటానని నామగని నామీద ఊ, అనుమానం. నోనింటికెల్లగానే అటుసూసి ఇటుసూసి జుట్టినలిగిందే యేమట్ట మాసిందేమొ అని ఊ పరీచ్చలెక్కతీస్తాడు. ఆమీద అత్తమ్మ ఓంచిమేస్తాది. ఆజాయిని నాకు కావోలిసినన్ని కాయిడిమద్దదెబ్బలు. అచలే,

యీాఒకరుచోడుగందా నామగడు ఆపైని తెల్లనీల్లుతాగితేఒళ్లేమెరుగడు. మారాజా, నామరిదోడున్నాడు, బాబూ ఆడుజూదగాడు. నేలేకుండా చూసి వృద్దోగత్తులియి మంచిమంచి జరీగుడ్డలుంటె అయికానేసి జూద మాడుతాడు. లెక్క పెకారc అప్పగించలేకనోనుసచ్చిపోతాను. యీా లాటికాపురం సేయలేక మాడిపోతున్నా. మారాజా, నాలోనేయేంయే డ స్తేయేముంది. మీారంతా ఆర్చేవారాతీర్చేవారా తీరిస్తేఅదుగోనీకూ ఆడికీ రంకులంజాఅని మెడగుళ్ళిరగ మొదుస్తాడుకాని మతిమాలిననా మగడల్లా అన్నాడని రంకుదాననుకోనేరునుండీ. నాగొప్పనోనుచెప్పు కోవడంకాదు. యీారపతివ్రతను అనిపేరుమోాశాను. ఏమనుకొన్నారో చాకలి కళికంటె పోకిరీలంజకొడుకులంతా యేంసీవాళ్లేస్తానో అనినేనీ యీాదినోస్తూంటే ఆయీాదిని పారిపోతారు. ఓలి బాబో నామగడొ స్తున్నాడు. పొద్దోయిందనికామోాసు (బట్టలమూాట నెత్తికొనును).

(మహాంకాలి, నూకాలు కర్రలతో ప్రవేశించును.)

మహాం—ఒలేయి, ఓలి కలికీ ? ఆగు. ఆగు. సీతస్నాజెండా? ఎక్కడికేయెల్తావు.

కళిక—ఇంట్టికెల్తునా.

మహాం—ఓరింటికి.

కళిక—మనింటికే.

మహాం—ఏంటి మనమంటూాన్నావు. సంపేస్తా. యింతసేపేమొ గుడుతో ఊసులాడుతున్నావు.

కళి—ఆయ్యోదేముడా, అగ్గితోడు నోనాలాంటిపని సేయగా యేనాడైనా సూాశావా ?

మహాం—ఛీయెదవలంజ సెప్పు యెవడితోనున్నావో? లేకుంటే సంపేస్తా ఆ, ఆచచ్చేదవననుకొన్నావా యేంటి (కొట్టును.)

కళిక—ఓలమారాజో, కొట్టకు దేవుడో, నీకుపున్నెముంటుం దయ్యో ! నోనేపాపమెరుగను సామి ! (ఏడ్చును.)

నూకా—(మహాంకాళిని పట్టుకొని) మహాంకాళి నీకిదేంచేటు కారమురా! పగడమునంటి పడుచుపిల్లని ఆలాకొట్టుతావు.

మహాం—ఓరియెదవ, నీబుద్ధికూడమాఱిపోయిదంటరా. నాఆలిని సూస్తావు నీసిగ్గొయ్యా.

నూకా—అదేందిరోయి ఆలాగంటున్నావోయి.

మహాం—ఏలాగనమన్నావు. నాఆలినీకళ్ళకు రిగడంవంటి పడుసుపిల్లయిందా ? నీకళ్ళుకూడా కాలిపోయినాఅంట్రా.

నూకా—ఛీ ఛీ యెదవా ఆలాఅనకానాకుసెల్లెలు. నేరంలేదేం కొట్టొద్దన్నాను.

మహాం—అదిగో అద్దెనే ఒద్దన్నది. అడ్డమైన లంజకొడుకూ ఆడదానిపచ్చమే.

కళిక—ఇదిగో నోను సత్తెప్పమానంగా సూరునిసాచ్చిగానో నేదోషము యెరుగను. మాఁరాజా నన్ను సంపకు.

మహాం—అయితే యేజామాయెమట్టలకొచ్చావు. యేయేసోట దిరిగావు. సంసారికిది లచ్చనమేనా, లంజాచావు (కొట్టును) చావు.

కళికి—ఓయిమాఁరాజా సంపకు. నోనేపాపమెరుగను. అగ్గిముట్టుతా సంద్రానురుకుతా పామునుబడతా, నోనేదోషము యెరుగను.

మహాం—ఛీలంజా, యింకయిచ్చ్చన్నకాడికిపో, నీసేతికూడు నోనుతిన్ను, పోయెక్కడికి మోతావో, నాబట్టలన్ని ఒప్పగించిపో మాదరచోదా. (కొట్టును.)

భద్రుడు—(ప్రవేశించి) ఓరీచాకలి అదేమిరా దానినట్లు కొట్టెదవు.

మహాం—బాబూ పొద్దుడుపేట బట్టలప్పగించొత్తానని బైలుదేరొచ్చేసింది. ఇప్పుడు జాంపొద్దెక్కిందిగందా యింతయిరగబాటుతో ఆడితోటీ యీడితోటీ యెర్రగానుంటానని యిచ్చకాలు మచ్చికలు

ఆడుతుంటే నేనుసైస్తానా. దీనిసేతికూడు తింటానా. నాగతినాడె దీని గతి దీనిదే. యీలంజినేలతానాబాబూ ?

కళిక—మారాజా! అగ్గిముట్టుకొని పెమానంసేస్తా బాబూ నోనేదోసమూ యెరుగను.

భద్రు—ఓరీ దీనివలన దోషమున్నట్టు లగుపడదు. కొట్టక యేలుకొనుము.

మహం—పోపోవయ్యా కబురుసెప్పేవు. అన్నాళ్ళులంకలోనున్న సీతామ్మను యెర్రిరాముడుకాగా యేలుకొన్నాడు. కాని నోనేలతా ననుకొన్నావా యేంటి ? పో, పో.

భద్రు—(చెవులుమూసికొని) పాపము శమించుగాక, ఓరీ నోరుమూయుము. ఇక నొక్కసారి యీమాటబలికితివేని నీనాలుక గోసెదను. (కత్తిదీయును)

మహం—మారాజా, దండాలు రచ్చించుడు.(నమస్కరించును)

భద్రు—ఓరీ నీవు నోరెత్తక మాయింటికిరమ్ము. మీతగవులు నేదీర్చెదను.

మహం—శిత్తం బాబయ్యా (అందరు నిష్క్రమించెదరు.)

---

## 2 రంగము—సభాభవనము.

(రాముడు అష్టావక్రుడును ప్రవేశించెదరు.)

రాము—ఆర్యా! అష్టావక్రమునీంద్రా! మాబావ ఋష్యశృంగుడును మాసోదరి శాంతమ్మయు విఘ్నములేకుండ యజ్ఞమునుబూర్తి చేసినారా ?

అష్టా—రామచంద్ర! ఆదంపతులయజ్ఞమమోఘముగాజరిగినది.

రాము—ఆర్యా! ఆమహోత్సవసమయమున మమ్మునేమైనఁ దలచినారా.

అష్టా—రామచంద్ర ! నీవంటి మహాత్ము నేలతలపకుందురు. మాచెల్లెలు వైదేహి గర్భవతి యగుటచే నామెనసహాయార్థముంపబడిన రామచంద్రుడును రాలేదని పలుసార్లు తలంచిరి. మఱియు మాచెల్లెలు సీత వీరమాతయగునని దీవించినానని చెప్పుమనియెను.

రాము—అటులైన మహాత్ములచే నను గ్రహింపబడితిని.

గీ. అనృతమాడని మునిచంద్రు ♦ డనిన పలుకు
భావిఫలసూచకంబయి ♦ పరిఢవిల్లు
నారునూరైనగాని యా ♦ ర్యవరులనిన
మాటజెల్లగవలెను ము ♦ మ్మాటికిలను.

అష్టా—అంతియేకాదు. గర్భవతియగుజానకి యేదికోరినను ముఖ్యముగ నెరవేర్పుమని యరుంధతీదేవియు మాతల్లులును సోదరి శాంతమ్మయు మాతో బరిపరివిధముల జెప్పుమనిరి.

రాము—వారి యానతి శిరసావహించెదను.

అష్టా—మాబావగారు దేవియైనసీతమ్మతో నిట్లుచెప్పుమనియె. ఓపలేనిదానవగుటచే నిన్ను దానొనరించు జన్నమునకై తీసికొనిరాలేద నియు బుత్రునెత్తుకొనిన నిన్ను ద్వరగావచ్చిచూచిసంతోషింతుననియు జెప్పుమనియె.

రాము—భగవంతుని యాశీర్వచనమున నట్లేయగుగాక.

అష్టా—కులగురువైన వశిష్ఠునివాక్యముల నాలకింపుడు.

గీ. జన్నమునుగనంగ ♦ జనినవారెల్లరు
వసుధ నేలక్రొత్త ♦ వాడవీవు
పిల్లతనము, ప్రజల ♦ జల్లగగనవలె
నత్యశోధనంబె ♦ శాశ్వతంబు.

రాము—మహాత్ములైన గురువులమాట నతిక్రమింతునా ?

గీ. ఆత్మసౌఖ్యంబు పోయిన ♦ నఖిలకష్ట
ములకు బాల్పడినను కల్మి ♦ దొలగియైన

ప్రియసతీమణివై దేహి ♦ విడిచియైన
జనుల సంతోషపఱచెద ♦ మునులు మెచ్చ.

అష్టా—అశ్లీలము ప్రతిహతమగుగాక! రామచంద్ర! అట్టి వాడవు గనుకనే నీవు రఘుకులదీపకుడవని ఖ్యాతిగాంచినావు. నీకు భద్రమగుగాక. నేనుపోయివచ్చెదను. శలవొసంగుడు.

రాము—చిత్తము. పూజ్యులకునా వందనసహస్రములని చెప్పుడు.

అష్టా—చిత్తము. (నిష్క్రమించును.)

భద్రుడు—(ప్రవేశించి తిరిగి పోవ బ్రయత్నించును.)

రాము—ఓయి భద్రుడా వచ్చి తిరిగిపోయెదవేల? రమ్ము.

భద్రు—మహారాజ! రామభద్ర—(సందేహించుచు)జయము జయము.

రాము—ఓయీ, సందేహింపకుము. నీవు మాతండ్రిగారి యనుచరుడవగుటచే రామభద్రాయని పిలిచినను తప్పులేదు. సకల దేశముల సంచరించి వచ్చితివికదా. విశేషములేమి?

భద్రు—(తనలో) అక్కటా, నేనెంతపాపుడను. లోకమాతయైన జానకీదేవిపైబడిన లోకాపవాదము నానోటనుండి వెలువడవలసివచ్చెనుగదా! చెప్పిన బ్రమాదమును, చెప్పకున్న నపవాదమును రాజద్రోహమును ఘటిల్లును. ఎటులైన జెప్పియే తీరవలెను. (ప్రకాశముగ) దేవా, రామచంద్ర! రామరాజ్యము దశరథరాజ్యమునుమఱపించుచున్నదని పౌరులును జ్ఞానపరులును పలువిధముల స్తోత్రముసేయుచున్నారు.

రాము—ఓయీ, నిన్ను స్తోత్రములమాట నడుగలేదు. ఎప్పటికేదియుచితమో యట్లు కాలానుగుణ్యముగ స్తోత్రముసేయుట పౌరులకు సహజము. నాయందేదైన దోషమారోపించినారేమో యెరింగించితివేని దానిని సవరించుకొనెదను.

భద్రు—మహారాజా! (కన్నులనీరు పెట్టుకొనును)

రాము—భద్రుడా, మాటచెప్పుటకు ముందుగనే దుఃఖపడి యెదవేల? అదేదో చెప్పరానిదైనను సందేహింపక చెప్పివేయుము.

భద్రు—దేవా, ఏమనిచెప్పుదును (చెవిలో నేదియోచెప్పును)

రాము—(నిట్టూర్పుతో) అన్నన్నా, యీమాట నాహృదయమునకు వజ్రాయుధపు బోటువలెనున్నదికదా! హాజానకీ, (మూర్ఛిల్లును)

భద్రు—అక్కటా, యీమహారాజును నాపాపిష్టిమాటలచే గూల్చితినికదా. దేవా! రామచంద్ర! ఊరడిల్లు మూరడిల్లుము.

రాము—(లేచి) హా, సర్వేశ్వరా!

గీ. ఆలి యొరునింటనుంట ద ♦ ప్పనటంచు
వహ్నిలోద్రోసి నిర్మల ♦ పరచినాము
కర్మవశమున దొల్లింటి ♦ కలుష మవని
నంతరింపక క్రమముగ ♦ నలముకొనియె.

హా జగదీశ్వర, లోకబాంధవ, తొలుత నేనెంతయనుమానించితినో యంతకు బదిరెట్లపవాదము విస్తరిల్లినది. ఓ సర్వసాక్షులార, ఓ ప్రభాకర నిశాకరాది గ్రహసంచయములార, భూమ్యాకాశాదిపంచభూతంబులార, ఎవరెంతదాచినను మీరెరుంగని యంశము భూమిలో నుండదుకదా? నాయర్ధాంగియందు దోషమున్నదో లేదో మీరెరుంగరా? ఆనాడగ్నిప్రవేశమును సేయింప హుతాశనుడు స్వయముగ జానకినిదెచ్చి యీమె భువనపావని, నిర్దోషియని నన్నేలుకొనుమని చెప్పుచుండ మీరెరుంగరా, ఇతరుని వశమున గొలదికాలమున్నదని ప్రజలామెను దోషిగా భావించుట ధర్మమా, మీరందరు లోకులకిది తగదని బుద్ధిచెప్పరాదా? అక్కటా, యికేమిసేయుదు? నాకికేదిదిక్కు? ఓఆకాశమా, నీవైన నీరవ్వసేయువాండ్ర నోరుమూయింపరాదా.

(తెరలో) "లోకులు సత్యమెరిగి పలుకరు. అయినను లోకాపవాదము ప్రాజ్ఞులు తొలగించికొందురు" ఏమీ లోకాపవాదమును

తీర్చుకొనుటయే యుక్తమనుచున్నారా ? అదియే వేదవిహితమైనచో నటులే చేసెదను. ఓహో పరమేష్టి ! నీవిధానముల కొకమార్గము లేదా?

సీ. శ్రుతులకంటెను పరి ♦ శుద్ధినిగాంచెనే
పలుగాకిలోకులు ♦ పలుకులిపుడు
అనలునికంటె న ♦ హాఃపతికంటెను
సత్యముందెలుపునే ♦ జనులనుడులు
అఖిలభూతముల సా ♦ క్ష్యముకన్నమిన్నయే
పామరజనుల దు ♦ ర్భాషణముల
సంయమీంద్రులవాక్య ♦ సరణికిమించెనే
కలుషంబులాడు లో ♦ కులపలుకులు

గీ. ఇట్టివిపరీతధర్మంబ ♦ దేలకలిగె
నింక శ్రుతులేల ? శిఖియేల ? ♦ యినుడదేల,
పంచభూతములేల ? యీ ♦ పలుగులాడు
మాటలే ధర్మశాస్త్రమై ♦ మహినివెలయు !

కావున జానకిని విడచివైచెదను.

భద్రు—స్వామీ ! యీకాకుల కూతలకా లోకమాతను సీతను విడుచుట ?

రాము—భద్రుడా ! లోకాపవాదము కడుచెడ్డది. దానిధర్మశాస్త్రములుసైత మధిగమింపజాలవు. కావున నీకింవదంతిమాపుకొనుటకు ప్రయత్నింపవలసినదే. కావున నీవుపోయి మాలక్ష్మణునిటకు దోడ్కొనిరమ్ము. పొమ్ము.

భద్రు—అన్నన్నా, ఎంతగతిపట్టినది దైవమా ! స్వామీ, మీరెరుంగని ధర్మములు లేవుకదా.

రాము—భద్రా, ప్రాణములుపోయిన కట్టెకు ధర్మములేల ? నీవు నే చెప్పినట్లుచేయుము.

5

భద్రు—చిత్తము (నిష్క్రమించును.)

రాము—హా రామా, ఎంత సిగ్గుమాలినవాడవు?

సీ. నీదైతపై నప ♦ వాదమున్నదటంచు
వినినంత ప్రాణము ♦ ల్వీడువవేల
నీమనోహారి సీత ♦ నీతిలేనిదటంచు
జనులాడ వినియును ♦ చావవేల
నీప్రాణపద ధర ♦ ణీకుమారిక రవ్వ
పాలుగా నసువుల ♦ బాయవేల
నీభార్యసీత దు ♦ ర్నీతి పరులనోట
బడ మేనిపై గాంత్ర ♦ బడగనేల

గీ. సిగ్గులేదోకో! సతుల ♦ శ్రీదలపవో
జ్ఞానమానాభిమానముల్ ♦ కలుగవోకో
మొండిప్రాణాలు నీమేని ♦ నుండిపోవో
రాముడా, చెప్పుమా యథా ♦ ర్థంబుగాను.

హాజానకీ! నీకెంతగతిపట్టనున్నది? ఆహా! సీతా! మన్మనః ప్రీతా!

గీ. నీకతంబున జనులు ను ♦ శ్లోకులైరి
నీయెడల వారిమాటలా ♦ నీతిదప్పె
లోకములనెల్ల నేలెడు ♦ నీకె యకట
కష్టములు వచ్చునననింత ♦ కాదె సీత.

లక్ష్మణుడు—(ప్రవేశించి) అన్నయ్యా? మీముఖారవిందము శోభావిహీనమై కనుపట్టుచున్నదే! ఏమికారణము?

రాము—తమ్ముడా! లక్ష్మణ! ఈరామునకింతశోభయనుమాట పుట్టదోయి,

చ. అలరులు లేనిచెట్టువలె ♦ నంశులులేని ప్రభాకరుండనా
కళలదొలంగినట్టి నిశి ♦ కాంతు డనంగను వీతతేజుడా

జ్వలనునిభంగి పాల్గొనవద ♦ వస్తువుబాయగ నున్న నాకు శో
భలుసుఖముల్ ముదంబును ధ్రు ♦ వంబుగజొప్పడునయ్య లక్ష్మణా!

లక్ష్మ—ఆహా! అన్నయ్యా! ఇదేమి విపరీతవాక్యములాడుచు న్నావు? వీతిహోత్రసవితృలకు తేజకాంతులు స్వభావసిద్ధములైనట్లులే నీశోభయనుపమానమై ప్రకాశించుగాక! మీరింత ధైర్యముతోబలు కుటకు నాకుగారణము కానరాకున్నది. వేగజెప్పుమా!

రాము—హా తమ్ముడా! చెప్పటకేమున్నదోయి వినుము.

చ. పలుగులు రన్వసేతురని ♦ భావముశో జనకాత్మజాత న
గ్నుల బడద్రోసి దివ్యులు ము ♦ ను ల్పరిశుద్ధయటంచు మెచ్చిపూ
వులగుఱియంగ జేకొనని ♦ పుణ్యయటంచును నట్టిదాని లో
కులు కలుషాత్ములాలనుచు ♦ గొంకక యారడిచేసె తమ్ముడా!

లక్ష్మ—ఏమీ! అలాగునా! (క్రోధముతో) ఓరోరి యళీక వాచాలులార! మహాపాపులార!

ఉ. ఎవ్వతె సత్కృపామహిమ ♦ నీసచరాచరకోటిపుట్టునో
యెవ్వతె చల్లగాగనిన ♦ నెంతయులక్ష్మి జెలంగుచుందురో
యెవ్వతె తీవ్రతన్గనిన ♦ నెల్లజగంబులు మాడిపోవునో
యవ్వనజాక్షి సీత కలు ♦ షాత్మయనంగను నోరుక్రొవ్వనే.

రాము—తమ్ముడా! లోకులపై నేలయాగ్రహించెదవు? ఇదినా ప్రారబ్ధము సుమీ!

గీ. ధరణి యేదేవిగని పవి ♦ త్రతనుగాంచె
వహ్ని యేసతి స్పృశియింప ♦ భవ్యమయ్యె
నట్టిసుచరిత్ర సీతకే ♦ యపయశమట
కటాకటా! నిప్పునీళ్ళను ♦ గడుగవలసె.

లక్ష్మ—అన్నయ్యా? ఆపాపాత్ములపై నాగ్రహముజెందకుండ బూజింపవలయునా?

ఉ. ఏకలుషాత్ము లేకృపణు ♦ లేశరులింగతమింతలేక ను
శ్లోకను లోకమాతను వ ♦ సుంధరపుత్రిక పాపియంచు బ
ల్గాకులరీతిబల్కిరొ చ ♦ లంటున వారల మస్తకంబుల
న్నీకరవాలధార వధి ♦ యించిదొలంచెద నామెరవ్వేలన్.

రాము—తమ్ముడా, శాంతింపుము. లోకులకంత దూరదృష్టితో బనిలేదు.

గీ. అనృతమైనను లోకోక్తి ♦ ననుసరించి
మనము చరియింపవలెను కా ♦ వునసుసీత
నడవులకు బంపివేయుటె ♦ యవసరంబు
భార్యయనిలోన సంకోచ ♦ పడగరాదు.

లక్ష్మ—హా! తల్లి, వైదేహీ! నీకెంతదురవస్థ ఘటిల్లినదమ్మా.

ఉ. మొన్నటిదాక నాకటికి ♦ బొక్కుచుగంటికి నిద్రలేక యా
చెన్నటిపంక్తి కంతువనసీమ ♦ రఘూత్తమ ప్రాణనాథ! యా
పన్నశరణ్య నాచెఱను ♦ బాపవెయంచును దల్లడిల్లు నీ
కన్నులనీరు దైవకృప ♦ గట్టగఁ గమ్మర ప్రాప్తమయ్యెనే.

హాలోకమాతా! సీతా! నీకుమరల వనవాసమా! హా వినజాల వినజాల! మనజాల! (ఏడ్చును.)

రాము—తమ్ముడా! ఎందులకేడ్చెదవోయి? దైవనిర్ణయమెవ్వరికైన దాటతరమా?

లక్ష్మ—అన్నయ్యా, పరేంగితములేని పామరజనులపలుకు కూతల పాటిచేసి యాదశరథవంశభవనదీపికను ఆపుణ్యశీలను మరల గానల పాలుసేతువా! అయ్యో, యిదెక్కడి ధర్మము, పఱులమాటల ననుసరించి ప్రవర్తించినవానికి జీవయాత్ర దుర్లభముకదా, భయపడియో కన్నుకుట్టియో శ్వానమఱచినదని సామ్రాజ్యభూషణమైన మణికిరీటమునుదీసి యవలపారవై చదరా? ధర్మాధర్మములులేవా? ఉచితానుచి

తములులేవా ? జగత్ప్రసిద్ధమైన యగ్ని ప్రవేశముగాంచి హుతాశనాది దివ్యులచేతను సంయమీంద్రులచేతను జానకి పరిశుద్ధురాలు, పుణ్యశీల యని సన్నుతులుగాంచలేదా ? ఈకాకులకూతల కర్థముచేసి పాటిం తువా సోదరా !

గీ. అగ్నిహోత్రమునకు జడ ♦ లంటెనన్న
నెంతవిశ్వాసపాత్రమో ♦ యంతెసుమ్ము
సీతకీనిందయనుచు వ ♦ చింపరాని
మాటనమ్ముట నీవెర్రి ♦ మానుమన్న.

రాము—తమ్ముడా ! ఎందులకీ పామరత్వము ? ఈవిషయమున నేనే యొక తెలివితక్కువపని చేసియున్నాను. ఏమందువా ? లంకలో జానకి యగ్నిప్రవేశమైనను అయోధ్యకువచ్చిన పిమ్మట నానారాజ మండలి నాహ్వానముజేసి పౌరులసమక్షమున మరల నగ్నిప్రవేశము గావించిన లోకులీనిందను వేయలేకపోదురు, ఆలంకలో నగ్నిప్రవేశమే జరిగినదో యేమిజరిగెనో పౌరులంత దూరదృష్టితో నాలోచించుట కవ సరమేమున్నది ? చిరకాలము సీత రావణుని సన్నిధినుండెగదా ! ఆరావ ణుడతిదుష్టుడుకదా ! అపవిత్రురాలు కాకున్నదాయని యొక్కటే యాలోచించినారు కాని లోకులు తొలుతజరిగిన పరీక్షవిషయమాలో చింపరు. మనవంశకీర్తిని రావణుడెత్తికొనిపోయిన భార్యను రాముడు తెచ్చియేలుకొనుచున్నాడని అపకీర్తినిగడించి నేనుఖలముచేసినవాడనగు దును. కావున నీయపవాదము మాయువరకు నేనుజానకిని—(ఏడ్చును)

లక్ష్మ—(అన్నను పట్టుకొని) అన్నయ్యా ! ఊరడిల్లుము.

రాము—(విచారముతో) హాభగవతీ, అరుంధతీదేవి, భగవాను లార, వశిష్టవిశ్వామిత్రులార, దేవీవసుంధరా, ఓజనకమహారాజా, తల్లీ కౌసల్యాదేవి, ఆత్మతుల్యుడా హనుమంతా, ప్రియసఖా సుగ్రీవమ

హోపకారీ, విభీషణా, త్రిజటాసీతప్రియసఖీ, యీరామహాతకుడు మిమ్మందర వంచించినాడు. యేమందురా, మీరెల్లరు కష్టించిచేసినపనికి యీరాముఁడు మరల నిఘాతముసేయుచున్నాడు. యేదేవిని మీరు మనః పూర్వకముగ లోకమాతయని తలంచితిరో యాసాధ్వి సీత నిప్పుడడ వుల పాలుచేయుచున్నాను. హా మైథిలీ సీతా (మూర్ఛపడును.)

లక్ష్మ—అన్నయ్యా ! లెమ్ము. మనము దుఃఖములకొఱకెపుట్టి తిమి కాని సుఖముకొఱకుగాదు. విచారింపకుడు లెండు.

రాము—(స్మృతికలిగి లేచి) హా తమ్ముఁడా, యీస్త్రీహంతకు నకు దిరిగి ప్రాణములు వచ్చినట్లేలచేసితివిగా ? హా వ్యర్థుడనుకదా.

గీ. ఇడుమలను కొఱతలేకుండ ♦ గుడుపుకొఱకె
సీతపాలిటి మృత్యువై ♦ చెలగునాడు
మొండిప్రాణము లీమేని ♦ నుండిపోక
మరలజేరును నాదైన ♦ దురితమునను.

తమ్ముఁడా ! సీతయందలి ప్రేమానుబంధమును బూర్తిగాద్రెంచి వేసికొన్నాను. కఠినతముడనైతిని. నాహృదయమును లోహముగ మార్చివేసితిని. కావున నీవు రేపటియుదయముననే సీతను గొంపోయి వాల్మీకిమున్యాశ్రమ సమీపభూమిని విడచిరమ్ము. ఇంతకుమున్ను జానకి తపోవనముల జూడగోరికయున్నదని నాతోఁ జెప్పినది. ఆకార ణముగూడ సమంజసముగనుండును.

లక్ష్మ—హా దుర్విధీ (క్రిందజతికిలబడి)

ఉ. ఎంతటి క్రూరకర్ముఁడనొ ♦ యీభువిఁబుణ్యచరిత్ర సీత దు
ర్వాంతభయంకరాటవుల ♦ యందున డింపుమటంచు రామభూ
కాంతుడు నన్ను నేర్పరచె ♦ గట్టి, సహింపగజాలనిట్టి లీ
హంతకుసిద్ధమాదు హృద ♦ యందుదహించెను వహ్ని లేకయే.

అన్నయ్యా ! నీవెంత చెప్పినను యట్టిదారుణకర్మకు నేనొడిగట్ట జాల. నన్ను రక్షించి యీకర్మనుమానుము. పరమపావనియైన సీత

కేడ ? కళంకమేడ ? దురాత్ముల పలుగుకూతలఁబాటించి నిండుచూలా లిని వనముల పాలుసేతువా ?

రాము—తమ్ముఁడా ! రాజ్యభారమునువహించి ధర్మాధర్మముల బరిశీలించు నేనే యీరవ్వకు దలయొగ్గిన దుర్గతులు కలుగవా ? కావున నామాట విని సీత నడవుల విడిచిరమ్ము. ప్రజల యనుమతిని రాజ్య మునేయుటుచితము, ప్రజలకంటె భార్యయెక్కువదికాదు. ఈమనస్తా పము సహింపలేక సీత ప్రాణములవిడచుగాక ! అపకీర్తినందుట మన వం శజులకు మేలుకాదు. నీవు దయారసమును విడచి యెట్లులైన విడచి రమ్ము పొమ్ము.

లక్ష్మ—హా! హతాశుఁడను. అదృష్టహీనుడనుకదా ! ఓయీ హనుమంత ప్రియసఖ !

ఉ. రావణు శక్తిచేత రణ ♦ రంగమునన్ బడి చావకుండ సం
జీవిని దెచ్చి క్రమ్మర స ♦ జీవితుగా నొనరించినాడవో
పావని ! యిప్పుడీగతిని ♦ భవ్యచరిత్రను సీత గానలన్
బోవిడనాడు హంతకుడు ♦ మూలమునైతిని నీకతంబునన్.

అన్నయ్యా, నేనట్టి భయంకరకృత్యము సేయజాల. మీరా మాట బలుకగనే నాదేహమునుండి ప్రాణములే పోయినవి. మీరీవిష యమై కొంచెమునిదానించుడు. రాముడు మహాసాధ్విని జానకిని నిండు చూలాలి నడవుల పాలుచేసిన కఠినుడని యందురు.

రాము—తమ్ముఁడా ! నాయందు విశ్వాసముకలదేని నాయాజ్ఞ నెరవేర్పుము. లేకున్న లోకులు నన్నెంత నిందించినను నేనేపోయి విడిచి వచ్చెదను. నాకిక వేయిమాటల జెప్పకుము. నేనిప్పుడు కాఠిన్యమునే వహించినాను.

లక్ష్మ—చిత్తము. (ఇద్దరు నిష్క్రమించెదరు.)



సీత—మరదీలక్ష్మణ! ఏమిఅట్లుసందేహించెదవు. నీలోనీవేదియో తలపోసికొనుచున్నావు. ఆసందేహమేమో నాకుజెప్పవా? నాడుపుష్పోద్యానమున మీయన్నగారిని నేను తపోవనము జూచు నభిలాషకలదని చెప్పినప్పుడు తానుకూడ వచ్చెదనని చెప్పి యిపుడు నీచేత నన్ను బంపించుటయు మధ్యమార్గమున దుశ్శకునములగుటయు గారణము దెలుపక నీవు విచారించుటయుజూడ కొండవిరిగి నాతలమీదబడినట్లు కొందల పడుచున్నదాన. అన్నా లక్ష్మణ! నీవునిజమునుజెప్పుమా? యెవ్వరికాపద మూడినది.

లక్ష్మ—తల్లీ! అన్యులకైన నేనిట్లు చింతిల్లుదునా? (కన్నుల నీరిడును.)

సీత—అన్నన్నా లక్ష్మణ! నీవైఖరిచూడ నాకుమిక్కిలిభయ మగుచున్నదికదా.

చ. విసుగక సర్వసౌఖ్యముల ♦ వీడివనంబుల నన్నుగొల్చి నా
డసురులచే విపద్దశల ♦ నందుచు రావణుశక్తి రొమ్మునన్
గసకస దూరునాడిటుల ♦ గన్నుల నశ్రులనింపవైతి వో
యసదృశ విక్రమాఢ్య నిజ ♦ మానతి నీయగదన్న లక్ష్మణా.

నాయనా పలుకవేమి?

లక్ష్మ—అమ్మా! జనకరాజనందనీ! యీదురాత్ముడేమని చెప్పగలడు?

ఉ. నమ్మినవారి కుత్తుకలు ♦ నంజక కోయదలంచు పాపి, దౌ
ష్ట్యమ్మున భూమిపై బ్రతుకు ♦ నట్టి మహా కలుషావతారి ప్రే
మమ్మున మీకు మేల్జరుపు ♦ మాదిరి వచ్చి మహావిపత్సము
ద్రమునను ముంపనున్న నను ♦ దగ్ధముసేయుము శాపవాక్కులన్.

సీత—ఔరా! ఏమీ! నీమాటలచే నాకు బ్రపంచకమె తల క్రిందగుచున్నదే! నాయనా! లక్ష్మణ! నన్నెందులకుదోడ్కొనివచ్చితివో నిజము చెప్పరాదా! ఏల సందేహించెదవు?

లక్ష్మ—అమ్మా! ఏమని చెప్పుదును.

గీ. హృదయభల్లములౌ మాట ♦ లెట్లువినగ
నేర్తువో తల్లి వచియింప ♦ నేరనమ్మ
దనుజవశయైన సీతను ♦ దగుదునంచు
రాఘవుండేలుకొనెనను ♦ రవ్వ కలిగె.

సీత—అయ్యో లక్ష్మణ! ఆరవ్వచే నానాథుండు నన్నుజంపు మని యాజ్ఞనిచ్చెనా? అడవులవిడచి రమ్మని యానతిచ్చెనా?

లక్ష్మ—అడవుల విడచిరమ్మని.

సీత—హా! రామచంద్రా! (మూర్ఛనొందును.)

లక్ష్మ—అన్నన్నా! నేనెంత దుర్మార్గుడను.

గీ. భువనముల మాత యీసీత ♦ భూమిజాత
హంతకుండ నయి యీమాట ♦ యనెడు భల్ల
మునను గూల్చితినను బోలు ♦ మూఢ జనుండు,
భ్రూణహంతకు డగువాడు ♦ పృథ్విఁగలడె.

పట్టుదప్పి పుడమినొరిగిన బంగరుబొమ్మవలె సోలిన సీలోక మాతను సేదదీర్తునా! లేక యిదేసమయమని కఠినాత్ముడనై లేచి పోవుదునా! పోవుటుచితముకాదు (సమీపించి) తల్లీ వైదేహీ! కర్మానుభవము ననుభవింపక తప్పదు. ఊరడిల్లుము లెమ్ము.

సీత—(లేచి) అన్నా లక్ష్మణ!

గీ. పంచభూతము లేమయ్యె ♦ భాస్కరుండు
నమృత కిరణుండు గ్రహము లే ♦ మయ్యెనయ్య
సురలు హాహా యనుచు మింట ♦ విరులుగురియ
నగ్నిలో జొచ్చి పరిశుద్ధి ♦ నందలేదె?

లక్ష్మ—అమ్మా! జానకీదేవి!

గీ. అందరున్నారు నీమూర్తి ♦ ననుసరించి
యగ్నిదేవుండె పరిశుద్ధి ♦ నందెననుచు

బల్కినా రిప్పుడీయప ♦ వాదపొడమె
దానిమాపగ నెవ్వరి ♦ తరముతల్లి.

కావున నిదియు బ్రాక్తన కర్మవశమున బొడమినది. కానినీయం దేదోషమును లేదు.

సీత—అక్కటా, ఈయపశోసాగరము నే నెట్లీదుదానను. ఇట్టి చెడునింద దలడాల్చి జీవించుటకంటె మరణమే సుఖముగనుండును గదా! అయ్యో లక్ష్మణ! నాకు మతిలేకయడుగుచున్నదానను. క్షమింపుము. వేమూల మెరుంగని మూఢులైన లోకులనిన మాటయేనా ధర్మశాస్త్రము? వేద విహితముగ నన్నగ్నిలో ద్రోసి పరిశుద్ధురాలని పుణ్యాత్ములందరు స్తుతించిన వాక్యములన్నియు మట్టిగలిసిపోయినవా! యిది మీకందరకు ధర్మమని తోచెనా? యికధర్మశాస్త్రముల ప్రయోజనమేమి? లోకులాడిన దాటయు బాడినది పాటయునా, నాకెరింగింపుమా?

లక్ష్మ—తల్లీ! యీమాటలన్నియుమాయన్నగారినేయడిగితిని లోకాపవాద భరించుట దుర్భరమనియు బత్నీ మోహంబునంజేసియపవాదమును గణింపకున్న దనమూలమున రవివంశమునకు గళంకము వచ్చుననియు నీవుతపోవనముల జూడనిచ్ఛయున్నదని చెప్పుటచేతను నన్నీయరణ్యంబున విడచిరమ్మని యానతిచ్చెను.

సీత—హా సర్వేశ్వర! నీసంకల్పములు దురవగాహములుకదా!

ఉ. ఈ వెరుగంగలేని కృతు ♦ లీమహిలో నుదయించునయ్యొ, నే
నావిధి లంకలోన న ♦ సురావళిచే నపవిత్రనైతినో
పావనతన్మలంగితినొ ♦ స్వాంతమునందున నీకు దోచదే
పావకు కీలలందురికి ♦ భవ్యతగాంచుట రిత్తపోయెనే.

ఇదియంతయు నాపురాకృత కర్మపరిపాకముకాని వేరుకాదు లక్ష్మణా! తలపరాని యీయపవాద శిరమున బెట్టుకొని పురమున నుండుటకంటె నడవులనుంట మేలెకాని యారవ్వతలంచినపుడెల్ల నాగుం

డెలు పగిలిపోవును. కావున నేనువ్యర్థమైన యీజీవములను భరింపజాల. నన్ను నీకరవాలమున దుదముట్టించి పొమ్మా.

లక్ష్మ—హా ! పాపము భరింపజాల. తల్లీ ! నీనట్లనకుము.

సీత—అయ్యో లక్ష్మణ !

ఉ. జానకి సాధ్వియంచు బలు ♦ సారులు లోకులు సన్నుతింప నా
మానసమందు బొంగుచు న ♦ మానుషవైభవమందు నేను నీ
జానపదాళిలో వినగ ♦ జాలని యీ చెడునిందవుట్టె నిం
కేను జగంబునందు దల ♦ నే క్రియనెత్తి చరింతు లక్ష్మణా.

లక్ష్మ—తల్లీ ! విచారింపకుము. అసత్యమెట్లు పుట్టినదో నట్లే యచిరకాలమున నీయపవాదము హరించును. నీవే మరల సుఖప్రసవమై రామచంద్రుని జేరగలవు.

ఉ. నీవు మహాపతివ్రతవు ♦ నీవలనన్ జగతిన్ సతీమణుల్
పావనులైరి నీనుగుణ ♦ వైభవమున్నుతియింప శక్యమే,
యేవిధినిందప్రాకెనటు ♦ లే హరియించు గ్రమక్రమంబుగా
శ్రీవెలయంగ బుత్రుగని ♦ చేరెదవీవు మహాత్మురామునిన్.

సీత—అయ్యో ! లక్ష్మణ ! నన్నోదార్చుటకుగాక యీఘోర మృగ సంకులారణ్యంబున నేను బ్రసవించుటయు నాయపవాదము హరించుటయు బుత్రునెత్తికొని రామచంద్రుని జేరుటయు తటస్థమగు నా ? హా ! నమ్మజాల. నమ్మజాల. కలలోనివార్త కదా ! నాయనా ! నేనిడుమల పాలైతినని విచారములేదుకాని మీయన్నగారు నాయందలి ప్రేమచే నిద్రాహారములుమాని కృశింతురని నేను భయపడు చున్నాను. నావలన నామహాత్మునకుగూడ మనస్తాపము కలుగునుకదా లక్ష్మణా ! ఇక నెందులకీ యడియాస. నన్ను విడిచిపొమ్ము. మీయన్న గారి యాజ్ఞ చెల్లించుము.

గీ. తొల్లినే సతీపతులం దుం ♦ దుడుకుజేసి
నెవ్వగలబెట్టి యెడబాపి ♦ నవ్వినానో

యందుకు శతాధికంబు ♦ ననుభవింప
కుండ, నాకిక దప్పునే ♦ యుర్విలోన.

లక్ష్మ— హా తల్లీ! లోకపావని! రామమయజీవితా!

సీ. భయదార్భటులచేత ♦ బ్రజలు నీమృగములు
చెలికత్తెలా నీకు ♦ సీతమాంబ
పలుకంటకంబులు గల ♦ కొండచరియలే
మణిమయశాలలే ♦ మాత, నీకు
కడుభయం బొనరించు ♦ గహనములివ్విహరించు
పూవుదోటలె నీకు ♦ భూమిపుత్రి
క్రూరజలగ్రాహ ♦ కోటితో వెలసెడు
నిర్ఝరుల్ కొలకులే ♦ నీకు దల్లి
గీ. పటుతరములైన నీయొంటి ♦ పణుగురాళ్లు
చలువరేరాల యరుగులే ♦ జనని నీకు
నక్కటా, యిట్టిభీషణ ♦ మైనచోట
నెట్టులొంటిగఁ జరియింతు ♦ వేదిదిక్కు. (శోకించును.)

సీత—అన్నా లక్ష్మణ! నీవు పురుషుండవు. ధైర్యశాలివి. నీవే యిట్లు నన్నుగూర్చి విలపించుచుండ కేవల మనుభవింపగల నాపాటు లేమి కావలయును?

చ. అడలకుమన్న సోదరుని ♦ యానతిజేయగదన్న నన్ను నీ
యడవుల వీడుమన్న హృద ♦ యంబున నిర్దయబూనుమన్న న
న్నిడుమల బొందుమంచు లిఖి ♦ యింపగ నెవ్వరు భ్రాతురన్నయీ
పుడమికుమారి కష్టముల ♦ బొందుటకేసుమి, జన్మమెత్తుటల్.

లక్ష్మ—హా పరమేశ్వరా, నన్నిందులకా నీవు పుట్టించినది.

గీ. రఘుకులారణ్య సీమకు ♦ రాజలేఖ
నిందుచూలాలి నబలను ♦ నీతిమాలి

ఘోరమృగసంకులంబైన ♦ గారుటడవి
విడచి దయమాలి యేగతి ♦ వెడలువాడ.

సీత—లక్ష్మణా ! అన్నగారి శాసన మలంఘ్యంబు కదా !

ఉ. ఎన్నగరాని ప్రేమమున ♦ నెల్లపడున్ ననునేలునట్టి యీ
యన్నదయన్ దొరంగి ఖలు ♦ లాడిన కల్లనమ్మి నన్నునీ
తెన్నున ఘోరశిక్షల వి ♦ ధించుమని యా రఘురాము మాటలన్
దిన్నగ వింటివో వినవో ♦ తెల్పవె మెయిన్ గనుమయ్య లక్ష్మణా.

లక్ష్మ—అమ్మా ! ఆ మహాత్ముని మాటలలో నుంత యవకాశమున్న నీవిధానము మాన్పింపకుందునా ?

చ. వలదని యెంతచెప్పిన ల ♦ వంబును నానుడులాలకింప క
ప్పలుగుల కూతలన్ దలచి ♦ పల్మరుసీతను ఘోరకాననం
బులవిడనాడి రమ్మనియె ♦ మోహముచే నటుసేయకుండినన్
గులము కళంకమౌననుచు ♦ నొక్కివచించె నికేమిసేయుదున్.

సీత—అక్కటా ! ఎట్టికాలవైపరీత్యము తటస్థమైనది లక్ష్మణా!

గీ. మూఢజనులమాట ♦ మూలంబుగాదన
మనసు రాయిచేసి ♦ కొనెనె ; యకట
ఆ ప్రియానురాగ ♦ మా ప్రసన్నతిదయ
నాథుడెట్లు మరచి ♦ నాడొమదిని.

లక్ష్మ—తల్లీ ! ఆరామమూర్తి యవన్నియు మరచుటలేదు. యీపిడుగువంటి వార్తను వినినది మొదలు సర్వప్రపంచమును మరచి,

గీ. కాల్వలై పారు నశ్రువుల్ ♦ కరముచేత
దుడిచికొంచును మదిబొంగు ♦ దుఃఖమునను
గద్గదికచేత వ్యక్తంబు ♦ కానిమాట
లాడుచీగతినను బంపు ♦ మనియెతల్లి.

సీత—లక్ష్మణా ! అట్టి నిందపాలైన నేను జనపదంబులనుండుట కర్హురాలనుకాను కాని నేను తపోవనంబులకేగ,

చ. పతిని వయస్యుల న్విడిచి ♦ భామరో, యీగతి నొంటిగానన
స్థితి కరుదెంచు టేలని బు ♦ షిప్రవరు ల్మునిపత్నులాడగా
ధృతి వహియించి యేకరణి ♦ దెల్పుదు నాపదనెట్లు ద్రోతునే
గతి వెడలించుదాన దృటి ♦ కాల మహాయుగవేళ లక్ష్మణా.

లక్ష్మ—(మ్రాన్పడి శోకించును.)

సీత—అక్కటా! నాదైన్యము చూడలేక బయల వ్రాసిన ప్రతిమవలె నామరది మ్రాన్పడి యెట్లునిలిచినాడో! అన్నా లక్ష్మణా విచారింపక నీయన్నగారియాజ్ఞను నెరవేర్చుకొమ్ము. శోకించినలాభము లేదు.

లక్ష్మ—అమ్మా జానకీ!

గీ. పెంచిన శుకంబు బావురు ♦ పిల్లివాత
బెట్టినట్టుల నిన్ను నీ ♦ బెట్టిదంపు
టడవిమృగముల పా ♦ ల్జేసి యక్కటకట
నెట్టులేగుదు నమ్మ మ ♦ హీంకుమారి.

సీత—నాయనా లక్ష్మణ! నాపూర్వకృతకర్మకు నీవేమి చేసెదవు. నీవు నీయన్నగారి యాజ్ఞకు బాత్రుడవు కావలదా! కాని లక్ష్మణా!

గీ. అకట యెప్పుడైన నాపద ♦ లారునయ్యొ
రాముఁ డెప్పుడైన నను బ్రోవ ♦ రమ్మనునొకొ
కలుగునే బంధువులజూచు ♦ కలిమినాకు
నాదరింతురె! తొల్లిటి ♦ యట్లునన్ను.

లక్ష్మ—అమ్మా! వెర్రిదానవుసుమి! నిన్నేల యాదరింపరు? కాలవశంబున నీయాపద కలిగినది కాని కొలదికాలమున నీయారడి యంతరింపదా. నీవు నిష్కళంకవని కొనియాడి జనులు నిన్నాదరింపరా.

సీత—లక్ష్మణా! కోకాలః కోధర్మః అని యిప్పటికింతయైనది కదా! ముందికనేమి జరుగునో యెవ్వరెరుంగుదురు? ప్రసవపుసమయమున రాజకాంతల గౌరవములేక యడవులపాలైతినికదా! భీకరజంతు

వులలో నేనుసుఖప్రసవమగుటయు నపవాదమంతరించుటయునా ! ఇదం తయు వెర్రిమాట. నేను వనవాసభీతికి జడిసి రామచంద్రు నపవాద పాల్సేయుట ధర్మంబుకాదు. నన్నిక విడిచిపొమ్ము మరియునానాధున కనేకవందనము లర్పించినానని పలుకుము. ఈ భీకరమృగములపాలై పంచత్వమునందినను మరియొక జన్మయందైన తనపాదము లాశ్రయిం చెద జేకొనుమని చెప్పుము. మఱియు,

గీ. అత్తలకు మ్రొక్కినానని ♦ యనగదయ్య
బంధువుల నడిగితినటంచు ♦ పలుకుమయ్య
మదిని శ్రీరామ పదభక్తి ♦ మఱువననుమి
అపయశము మీకురాకుండ ♦ నఱిగితనుమి.

లక్ష్మ—హా ! తల్లీ ! లోకపావని నిన్నీ ఘోరాటవులనెట్లువిడిచి పోవుదునమ్మా ! అయ్యో! నామేనెల్లవడంకుచున్నది. అన్నన్నా!యన్న గారియాజ్ఞ మీఱరాదుకదా !

సీ. విపినవీధుల సీత ♦ విడిచిపోవుచునుంటి
దాపసాంగనలార ! ♦ దయనుగనరె
ఝిల్లీ మృగములార ♦ సీతను మీ మోలిల
బెట్టి పోవుచునుంటి ♦ ప్రేమగనరె
వనదైవతములార ♦ వనజాక్షి వైదేహి
గాచిరక్షింపరే ♦ కరుణతోడ
జీవనస్ఫతులార ♦ యో నగోత్తములార
రక్షింపరేమీరు ♦ రామరామ

గీ. నిండుచూలాలి నీసీత ♦ నిండుదయను
గాంచుచుండరె హరులార ♦ కరిణులార
కొలకులార మహానదీ ♦ కులములార
బ్రోచుచుండరె ప్రేమ నీ ♦ భూమిసుతను.

తల్లీ! నిన్ను విడచిపోవుచున్నాను. శలవిమ్ము. (ప్రదక్షిణముసేయును.)

సీత—సౌమిత్రీ ! దయయుంచుము.

లక్ష్మ—తల్లీ, రామాజ్ఞకు బద్ధుండనై యిట్టిఘోరకార్యమును జేయుచున్నాను. క్షమింపుము. మహాక్రూరుఁడను. అమ్మా వైదేహీ ! నీకివేవందనములు. పోవుచున్నాను. (నిష్క్రమించును.)

సీత—అక్కటా ! మఱది లక్ష్మణుడు నన్నీఘోరకాంతారమున విడిచిపోవలేక కన్నుల నీరువెట్టుకొనుచు మరలమరల దిరిగి చూచుచు నెట్లుపోవుచున్నాడో. అన్నన్నా ! నాజీవితచరిత్ర మద్భుతముకదా, పరిణయమైనది మొదలు వనవాసమనిపదునాల్గేడులును పిమ్మట సుఖపడితిమికదా, ఫల మందనున్నదికదా యనునంతలో గ్రమ్మర నరణ్యావాసముసంభవించెనే. అక్కటా! నాకింకేదిదిక్కు. నన్నీభీకరారణ్యమునబ్రోచువారెవ్వరు ? ఓహో ! జానకీ ! నీకితరరక్షకులుకావలయునా ? ఎంతపిచ్చిదానవు సర్వజగములకును రక్షకుడైనశ్రీరామచంద్రుడేనిన్ను విపినభూములవిడచిన నిన్నింకబ్రోచువారెవ్వరు ? నీవుకడుమందభాగ్యురాలవు. నీవుబుట్టినదిమొదలేదో విచారమె. యేమందువా !

చ. శివునిధనస్సునెక్కిడుప్ర ♦ సిద్ధునికై వగకొన్నినాళ్ళు రా
ఘవుడది పూర్తిజేసి సరిగా ♦ సుఖమిచ్చెడువేళ భీకరా
టవి బదునాలుగేండ్లు వన ♦ టన్ దపియించి గృహంబుజేర నా
ధవుఁ డపవాదభీతి గృప ♦ దాల్పక గానలపాలుజేసెగా.

ఈవిధముగ బ్రాయమువచ్చినదాది నాకు గష్టములేకాని సుఖంబిసుమంతయులేదుకదా! ఏముహూర్తమున రామునితేజమునాహృదయమందు బ్రవేశించెనోకాని మరలనరణ్యావాసమే తటస్థమైనది అక్కటా! మిన్నుముట్టు తరంగాసంఘంబుననొప్పు మహాంభోనిధిలో జిన్ననావనైన నడపవచ్చుగాని స్త్రీతనజీవితమును నిష్కళంకముగ నడుపజాలదుకదా.

చ. అనలసమానమైకలుష ♦ మంటకయుండ జరించుచుండినన్
వనజదళాక్షీ పూర్వకృత ♦ పాపముచే జనలోకమందకా

రణముగ నిట్టి నిందలు ప ♦ రాభవహేతువులై జనించుగా
మనసతులాత్మ జీవితము ♦ బొల్పుగబుచ్చుట గష్టమెంతయున్.
ఇంతయేల ?

గీ. జగములనునెల్ల తలక్రిందు ♦ లుగనొనర్ప
జాలు ననసూయబోలిన ♦ సాధ్వియొకతె
యొంటిబరునితో మాట్లాడు ♦ చుంటగనిన
యంత శంకింత్రు సత్యంబు ♦ నరయనెవరు.

కావున స్త్రీ జీవితము కడుభయావహమైనది.

గీ. అగ్నిలోజొచ్చి విమలాత్మ ♦ యనుచు యశము
గన్న నాకీవిధంబుగా ♦ గలిగెనింద
యింక తక్కినవారల ♦ కేమిదిక్కు
గలదు ప్రారబ్ధకర్మంబు ♦ గాదెతలప.

ఇట్టియపకీర్తి పాలయి సకలవిధములపోషించుభర్తచే విడువబడి యరణ్యములజీవించుటకంటె ప్రాణములబాయుటమేలుకదా? అయ్యో! నాకెట్లుమరణములభించును. నాకర్మానుగతకష్టము నెవరనుభవింతురు. హా! సర్వేశ్వరా! అనుభవింపజాల నాకువేగ మరణమును బ్రసాదింపుము. ఓక్రూరవ్యాఘ్రాది మృగంబులార !

సీ. కరుణసుంతయులేక ♦ కరికుంభముల జీల్చు
హరులార ! ననుజంప ♦ సరగరారె
కనినయంతనె కురం ♦ గములభక్షణసేయు
పులులార ! ననుజంపి ♦ పోరెమీరు
నిశ్వాసముల జీవ ♦ నిచయంబు బరిమార్చు
సర్పంబులార ! నన్ ♦ జంపరారె
ఓకిరాతకులార ♦ యోవనచరులార
ననుజంపి మీరు పు ♦ ణ్యమునుగనరె

గీ. క్రూరభల్లూక ముఖ జంతు ♦ కులములార
భయదకంటక సూరక ♦ ప్రతతులార !

మరణమున కింతవెదకేడు ♦ తరుణినన్ను
మ్రింగిమీాక్షుత్తుపాధను ♦ మెలపుకొనరె.

అక్కటా! మీాలోనొక్కరును నాప్రాణముల దీయనెంచలేదు గదా! ఆరామచంద్రునకు బనికిరానటులే మీారు భక్షించుటకుగూడ బనికి రాకపోతినా! అయ్యో! ఎంతయదృష్టహీనురాలను? ఎంతటిమహా పాపురాలను? హా! హా! శ్రీరామవిశ్లేషదుఃఖమును భరింపజాల. ఓదుష్టవిధీ! అహల్యాశాప విమోచన మఃఖకృత్యములచేఁ గేవలము భగవంతుండనిపించుకొనిన శ్రీరామచంద్రునకు దేవేరినై నన్నిట్లుకష్టముల పాలుసేయుట నీకుఁ దగదుసుమీా! నేనేమిపాపమును జేసితిని? సుఖము లీయకపోయిన మానె. మరణమునైననొసంగరాదా? హారామచంద్ర! హా! మహానుభావ! ఓసంయమీాంద్రులార! నాకు మరణం బొసంగుడు. హా ప్రాణేశ్వర! (మూర్ఛనొందును.)

(వాల్మీకి, కృష్ణవేణి ప్రవేశించెదరు.)

వాల్మీ—కృష్ణా! యీాయరణ్యమున నేదో స్త్రీ దిక్కులేక ప్రలాపించుచున్నది. పోయి రక్షింతము రమ్ము.

కృష్ణ—ప్రాచేతసమునీంద్రా! అల్లదే కురువకవృక్షము పొంత నెవ్వతియో మూర్ఛిల్లినది. చూడుడీ.

వాల్మీ—(సమీాపించి కమండలోదకమును జల్లి) ఓసాధ్వీరత్నమా! లెమ్ము. ఊరడిల్లుము.

సీత—(లేచి) హా సంయమీాంద్ర! మీాకివే ప్రణామశతంబుల జేయుచున్నదాన. భగవతీ! నమస్కారము. పుణ్యులార! భగవంతుని నుండి విడువబడి దిక్కులేక మరణమును గోరి మూర్ఛిల్లిన నన్నెందులకు ప్రబోధించిరి. అక్కటా! నాకుజావుకూడ కఱవైపోయినదికదా!

వాల్మీ—అమ్మా!

గీ. ఎవతెవోయమ్మ యొంటిగ ♦ నీవనమున
నడలుచున్నావు నీపేరు ♦ నుడువుమమ్మ

శ్రీసతీమణివో లేక ♦ శివుని సతివో
కాకవనలక్ష్మివో మహా ♦ కాంతవో కో.

సీత—మునికులచంద్రమా ! నేనుదిక్కుమాలినదానను. అంత క్షమించి నాచరిత్రము చెప్పజాల.

వాల్మీ—నేనే తెలిసికొందునులే. (ధ్యానమభినయించి) ఓహో! తెలిసినది. తల్లీ వైదేహీ! ఊరడిల్లుము.

గీ. రవికులాంబుధి చంద్రుడౌ ♦ రాముసతివి
పంక్తిరథు కోడలివి నీవు ♦ భవ్యమతివి
జనకభూనాథు కూరిమి ♦ తనయ వీవు
వగవ వలదమ్మ ప్రారబ్ధ ♦ వశము సుమ్మ.

సీత—హా ఋషివర్యా ! నాకెట్టిగతిపట్టినదో తిలకించితిరికదా ! ఇట్టిదాననైన నాకీ జీవయాత్రతో నిమిత్తముండునా ? కరుణించి నాకు మరణోపాయము నానతీయుడు.

వాల్మీ—అమ్మా జానకీ ! నీదుఃఖకారణము నేనెరుంగుదును విచారింపకుము.

గీ. పలుగులారడిబెట్టని ♦ ప్పగిది రామ
చంద్రుడొనరించెగాని నీ ♦ సాధ్వితనము
నెవ్వరెరుగరు జగముల ♦ నెల్లనీవు
పావనము సేయజాలిన ♦ భవ్యమతివి.

కృష్ణ—తల్లీ ! విచారింపకుము. ఆపదలు కాపురములుసేయవు. భగవాన్ వాల్మీకిమునీంద్ర ! యీపూజ్యురాలిపై నేచెడుగులేమి నింద మోపిరి.

వాల్మీ—తాపసీ కృష్ణవేణీ ! చెడుగులగు మూఢులు సత్య మెరుంగక—

గీ. రక్కసుడు చెఱగొనిన భా ♦ ర్యను మరలను
రాముడేలెదునని యొక్క ♦ రవ్వపొడమె
అగ్నిజొచ్చుట దేవత ♦ లక్కజముగ
విరులగురియుట దలచిరే ♦ వీసమైన.

కృష్ణ—ఔనౌను. లోకు లిదంతయు బరీక్షింతురా ? కాని యీ జగత్సామ్రాజ్యరాలికీనింద పూర్వకర్మవశంబున బొడమినది కాని మరి యొకటి కాదు. తల్లీ జానకి ! విలపింపకుము. నావెంటరమ్మా. నిన్ను సర్వవిధముల బోషించెదను. ఈమునీంద్రుండు వాల్మీకి. నీకు దండ్రి వంటివాడు. నిన్నాదరించును.

వాల్మీ—బిడ్డా ! నీకు సుంతయు గొఱంతలేకుండ గాపాడెదను. యీజలంబుచే నీకనుల గడగికొనుము (జలముబోయును)

సీత—(కన్నుల దుడిచికొనును)

వాల్మీ—తల్లీ !

చ. జనకమహీశుడంచు నను ♦ స్వాంతమునందు దలంపుమమ్మ నీ
మనసునదుఃఖమొందుటలు ♦ మానగదమ్మ వివేకశాలినుల్
మునిపతులెల్లరున్ నిరత ♦ ము నిన్నుగొల్చుచు నుందురమ్మపా
వనివికదమ్మ యీనడియు ♦ వాయును రాముడునిన్నునేలెడుఁగా.

సీత—

ఉ. ఓయనఘాత్మ ! యేటికిటు ♦ లూరడిలన్వచియించి సర్వదా
కాయముబాయనున్న నను ♦ గ్రమ్మర నీయడియాసపాలుగా
జేయుచునుంటివయ్య నిర ♦ సించిన యారఘురామమూర్తి వా
లాయము నన్నునేలునె, క ♦ ళంకముమాయునె, మానిచంద్రమా

కృష్ణ—బిడ్డా ! జానకీ ! ముమ్మాటికిని ప్రాచేతసుని యమోఘ వాక్యములు జరిగితీరును. చింతింపకుము.

వాల్మీ—అమ్మాయి జానకీ !

గీ. రాముతేజంబు నీజఠ ♦ రంబునందు
వెల్గుచున్నది యద్దాన ♦ వెతలుదీరు

సంశయింపకుమమ్మ నీ ♦ స్వాంతమునను
రమ్మ ప్రసవింప మాయాశ్రీ ♦ మమ్మునకును.

కృష్ణ—జానకీ! జగన్మాతవైన నీకు మేమునర్వోపచారము లొనర్చుట యాశ్చర్యముకాదు. సందేహింపకుము.

సీత—భగవతీ! కృష్ణతాపసీ! మీరందరు నన్ను బిడ్డకంటె నెక్కుడుగ జూచెదరని యెఱుంగుదును. నైనను,

చ. పలుగులచేత రవ్వబడి ♦ భర్త వనంబులపాలుసేయ నే
నలుగురిలోన రామనర ♦ నాథుని భార్యనటంచు జెప్పచున్
దలనెటులెత్తికొంచును జ ♦ నంబులమ్రోల జరింతునమ్మ యే
కలన నడంగునమ్మ పలు ♦ గాకులయారడి కృష్ణతాపసీ!

కృష్ణ—అమ్మా! జానకీ! ఆరవ్వ యెట్లు వచ్చినదో అటులే అంతరించును. అసత్యము లెన్నిటికిని సుస్థిరములు కావు.

సీత—అటులైన పూజ్యులమాట శిరసావహించెదను.

(అందరు నిష్క్రమించెదరు.)

---

2 రంగము—రహస్యభవనోద్యానము.

రాము—హా ప్రాణేశ్వరీ! జానకీ!

చ. ఉడుగని ప్రేమకల్గిన ప్రి ♦ యుండె మనంబున రాయిజేసి కొం
చడవులపాలుచేసెనని ♦ యాత్మతపింపగ నేడ్చుచుంటివో
పుడమికుమారి, యేమయితి ♦ వో, వనభూముల దుష్టజంతువుల్
వడినిను మ్రింగబైకుఱక ♦ బ్రాణములెట్టుల తల్లడిల్లెనో.

అకటా! నిన్నిట్టి కష్టవారధిలో ముంచివేసితినని నన్నెంత దూరితివోకదా! కాదు. కాదు. నాపొరబాటు మన్నింపుము. నిన్ను నేనెంతకష్టపెట్టినను నీవునన్ను లేశమాత్రమును నిందింపవు. నీవు మహాసాధ్వివి. సుగుణభూషణివి. అట్టిమహాసాధ్వివగు నిన్నుదుఃఖపెట్టు నేనే హంతకుడనుసుమి. అక్కటా! కన్నులనద్దుకొనుచు గాలక్షేపముచేయ దగిననేను నీకపచారము చేసితినికదా! హా నామనోహారీ! ఆ పలు

గులకూతలబట్టి నిన్ను ఘోరారణ్యముల పాలుచేసినీకొంతకు పరితపించు చుంటినికదా ! దేవీ నాయవస్థనేమందును ?

చ. నినువిడనాడినందున ఘ ♦ నీభవమయ్యె వియోగవహ్ని, చం
దనములు మేనికిన్ సహజ ♦ తాపములయ్యెను శైత్యవస్తుసే
వనములు మన్నహంబులుగ ♦ బాల్పడె నన్నమునీాదియిచ్ఛయున్
గనులకు నిద్రయున్ సుఖము ♦ కల్గదు లోకమెశూన్యమయ్యెడిన్.

హాజనకరాగభవనపతాకజానకీ !

చ. ఇరువురమొక్కదేహముగ ♦ నేకమనంబున సంచరింపగా
దరుణిరొ ! యిర్వురందొకరు ♦ దైవవశంబున నన్యసీమకై
యరిగిన నింటనున్న జను ♦ డక్కడపొందెడికష్టభారమె
వ్వరువచియింప నర్హులు ధృ ♦ వంబుగ భోక్తలెచెప్పగావలెన్.

హారామమయజీవితా ! సీతా ! రఘువంశము నుద్ధరింపదగిన పుత్రుని జఠరమందుంచికొనిన మంళళాంగివి. ఆహా ! నిన్నుఘోరాటవులలో క్రూరమృగంబులు పురుడువోయునని పంపితినను కొంటివా ? హా ! యెంతనిర్భాగ్యుడను దేవీ ! నీవునాచేతవిడువబడినను పుణ్యాత్మురాలవే. ఏమందువా ? కంటకబాధనందినపుడునుపులులుమ్రింగవచ్చినపుడునుఈ వేళనావేళయననేల,భర్తయనుప్రేమచేతనో లేకనీపాలిటికిగ్రూరకర్ముడ నౌటచేతనో యనుక్షణమును హారామా! హారామ! యనితలంపకుమా నవు. అందువలన సంతతభర్తృధ్యానపరాయణవై మహాపతివ్రతలకు శిరోభూషణమవై యుత్కృష్టమైన ప్రతిభనుగాంచెదవు. కావున నీవు ధన్యురాలవే. నేనే సర్వవిధములవ్యర్థుడను. దేవీజానకీ! నాకొక్కసారి దర్శనమిచ్చిపోవా ? యీాసడికినోర్వజాలక యట్లుచేసితినికాని నీకునేపగ వాడనా ? హారామప్రియ ! హామనోహారీ ! యీాదురాత్మునిక జూడ రాదని యెంచితివా ? నాముద్దులగుమ్మా ! జానకి ! (నిన్నుహాతో) ఆహా ! ఇక్కడికి నాతపము ఫలించినది. అల్లదే జానకి (కొంతదూర మునడచి) అక్కటా ! వ్యర్థమనోరథుడనైతినికదా ?

ఉ. తివయొకండుచూచి మెయి ♦ తీవయటంచును వ్రేలుచున్న యా
పూవులగు త్తిమోముగను ♦ పొల్పగుపై కరుతంబువల్కగా
భావనజేసి సీతయని ♦ భ్రాంతినిబొందితి నంతెగాని సీ
తావిభవంబుకాదిది య ♦ దార్ఢ్యము నాదురదృష్టరేఖయే.

హావసుంధరాతనయా ! నిరంతరసుఖంబొసంగిన నీవునాకు మర పురావుకదా.

మ. శ్రమముంబొందిన నన్ను జేరి హృదయే ♦ శా! సాక్కితేయంచుగూ
రిమితో జేలచెఱంగున న్విసరి వా ♦ రింపన్ బ్రయత్నింతువో
య్యెలస్వాంత, భవద్గుణాతిశయ మా ♦ హా ! మర్వగానౌనె దు
ర్భ్రిమయేకాని యదృష్టహీనుడనగు నీ ♦ రాముండు నిన్గాంచునే.

యీావిధమైన యనురాగముజూపి నిన్ను ఘోరాటవుల పాల్జేసిన కృతఘ్నుడను. నీవిషయమై నేనొనరించిన యపకారమును మరచినన్ను నీవు హారామ ! హారామ ! యని నానామమేజపించుచున్నావు. కావున నీవు భగవంతునికృపచే బుత్రులగాంచి రవ్వనుబాసి పవిత్రురాలనిపించు కొని నన్ను జేరగలవు. సుకృతంబులూరకపోవు. హాసాధ్వీశిరోరత్నమా !

(తెరలో)

మహాత్మా ! రామచంద్ర ! కాలకృత్యములకు వేళయైనది.

రాము—ఇదిగోవచ్చుచున్నాను. కాలకృత్యములయందుసీతా స్మరణవినా యన్యము లేదుకదా.

(నిష్క్రమించును.)

---

## 3 రంగము—వాల్మీకాశ్రమము.

(వాల్మీకి అనుష్ఠానముతో బ్రవేశించును.)

వాల్మీ—జనకరాజపుత్రికి బ్రసవచిహ్నము లగుపడినవట. ఈ ముహూర్తము మంచిదగునో కాదోకదా! పరిశీలించెదనుగాక (ఆకసమువంకజూచి) ఓహో! దివ్యమైన ముహూర్తము.

శిష్యు—(ప్రవేశించి) గురువర్యా! రామచంద్రునిల్లాలు సుఖప్రసవమై యిద్దరు మగపిల్లలను గాంచినది.

వాల్మీ—ఓరీ! సంతోషము. నీవీ కుశలవములలోనీయుదకము నాబాలకులకు రక్షోబాధకహరణ మంత్రంబులతో మార్జనజేయుము. వారు కుశలవనామములతో నొప్పుదురు. గ్రహసంపద బాగుగానున్నదని కృష్ణవేణితో జెప్పిరమ్ము.

శిష్యు—చిత్తము. (కుశలవములను జలకలశములను దీసికొని పోవును.)

వాల్మీ—జగన్మాతకు నేను రక్షకుడనైనందుల కెంతయుసంతోషించుచున్నాను.



# లవకుశ.

# చతుర్థాంకము.



## 1 రంగము—అరణ్యము.

(చెట్టుమీదనొక బాలుడును చెట్టుక్రిందనొక బాలుడును ప్రవేశించెదరు)

కుశు—(చెట్టుక్రిందనుండి)తమ్ముడా! నామాటవినుము. చెట్టు దిగుము. నిన్ను ముట్టుకొననులే.

లవు—(చెట్టుమీదనుండి) అన్నయ్యా! చెట్టుదిగిన నన్నేల ముట్టుకొనకుందువు?

రాము—(ప్రవేశించి) ఈబాలులెవ్వరు చెప్పుమా! వీరలజూడగనే నాకపూర్వప్రేమ జనించుచున్నది.

కుశు—తమ్ముడా! నిక్కము వచించితివి. నిన్నంటను. నీచెట్టుకొమ్మలమీద దిరుగుచున్న గాలుజారిన నేలగూలెదవు.

లవు—నేనట్లు జారిపడువాడనుకాను.

కుశు—నేనే యాచెట్టెక్కిన నాకుజిక్కెదవా లేదా? అప్పుడేమిచేసెదవురా?

లవు—చదువలేదా! రామాయణమున మహేంద్రగిరినుండి లంకలోనికెట్లు హనుమంతుడు లంఘించెనో యట్లే చెట్టుమీదనుండి యాకనుపడు మర్రిచెట్టుమీదికి దాటెదను.

రాము—(తనలో)ఆహా! యీమునిబాలకులు రామాయణము సంపూర్ణముగ జదివినట్లు తోచుచున్నదే? రామాయణమును లక్షణవంతముగ వాల్మీకి మునీంద్రుండు రచించినాడని వినియుంటిని. వీరు ప్రాచేతసుని శిష్యులు కావచ్చును. వీరివలన నాప్రాణేశ్వరివృత్తాంతములు దెలిసికొందునుగాక. (సమీపించి) మునిబాలక! మీతమ్ముడు

నీవు ముట్టెదవని చెట్టుమీద దిరుగుచున్నాడు. కాలుజారిన ప్రమాదము రాగలదు. వానిని ముట్టనని పల్కుమా.

కుశు—తమ్ముడా, యీతడెవడో మనకిరువురకు మధ్యవర్తియై వచ్చినాడు. వీని సమక్షమున నిన్ను ముట్టనని బాసచేసితి. మెల్లనచెట్టు దిగిరమ్మా.

లవు—అటులే దిగివచ్చెదను. (దిగివచ్చును.)

రాము—వత్సలార, మీరెవ్వరు? మీపేరు లెయ్యవి.

కుశు—మేము మునిబాలకులము. నాపేరు కుశుడు. నాతమ్ముని పేరు లవుడు.

రాము—బిడ్డలార! మీతల్లిదండ్రు లెవ్వరో చెప్పుడీ.

లవు—ఓహోహో! పాంథుడా! మాప్రచారము నీకేల? బంధుత్వము తెలిపెదవా?

రాము—వత్సా! త్వరపడకుము. నేనడిగినదాని కుత్తరమిమ్ము.

కుశు—అయ్యా! నీవు మాకు గురుడవా! ఏమి యట్లు పలుకుచున్నావు? నీవెవ్వడవో మాకు దెలుపరాదా?

రాము—అనుంగులార! నేనొక వెర్రివాడను.

లవు—సరి. సరి. బాగున్నది. అటులైన మేమొక పిచ్చివాని పిల్లలము.

రాము—పోనిమ్ము. మీతల్లిపేరైన జెప్పుడు.

కుశు—మాతల్లిపేరుతో నీకు నిమిత్తమేల? ఆపుణ్యశీలపేరు నీవుచ్చరించుటకు దగవు.

లవు—అన్నయ్యా, యీవెర్రివానికీ విషపుబ్రశ్న లేలరా?

రాము—వత్సలార, నాముద్దు చెల్లింపరా?

కుశు—ఏమందువు.

రాము—మీతల్లి పేరు చెప్పుడు.

లవు—అయ్యా నీకెందులకు?

రాము—తరించుటకు.

కుశు—స్మరించిన నీవు తరించుట సత్యమే. యేమందువా, మహాపతివ్రతా శిరోమణియాటచేత. అయిన మాయెరిగినంతవరకు జెప్పెదము వినుము.

మ. ఎవడో యొక్కజడుండుతప్ప మహిలో • నెప్పొద్దు నీసర్వమా
నవులున్మాజనయిత్రి గాంచుచు జగ • న్మాతయటంచాడగా
జెవులన్వింటిమి గాని నామ మెదియో • చెప్పంగలేమయ్య మం
త్రవిశేషంబుగనెంచబుణ్యా! యనరా • దా! యామెలోనెంచుచున్.

మరియుఁ బావని యని కొందరు పిలిచెదరు.

రాము—(తనలో) ఓహో! చిత్తమా! తత్తరమందకుము. నీకేదో యొకదారి కనుపట్టనున్నది. (ప్రకాశముగ) బాలకులారా! జననీ జనకుల నామముల జెప్పుట కింత చర్చకావలయునా? నిక్కమైన పేరు చెప్పరాదా?

లవు—అన్నయ్యా! యీతడు వెర్రివాడనని చెప్పుచు నీని ప్రశ్నముల కుత్తరమీయనేల?

కుశు—పాంథుడా! నీకు మేము చెప్పవలసిన యవసరములేదు. మమ్ముల విడువుము. మేము పోయెదము.

రాము—వారిపేరులు చెప్పకున్న పోనిండు. మీరెవరి చెంత జదువుకొనుచున్నారు.

కుశు—వాల్మీకి మునీంద్రుని శిష్యులము.

రాము—ఆ యనఘుని మీరేమని పిలచెదరు.

లవు—తాతా యని యందుము.

రాము—మీతల్లి సురక్షితముగ నున్నదా?

కుశు—ఓహో! దయాస్వభావునివలె నగపడుచున్నావే.

రాము—బిడ్డలార! నేను దయారహితుడను కానుకదా?

లవు—అ హ హ హా ! (నవ్వి) ఇంతమాత్రముననే దయగల వాడవని యెట్లు నమ్మెదుము. నీమొగమె నీదయాశూన్యతను చెప్పు చున్నది.

రాము—వత్సా ! నామొగమెట్లున్నదో నిజము చెప్పుమా ?

కుశు—వెర్రివాడ !

ఉ. చెప్పుట కేమి కాని చెయి ♦ చేతల బ్రాణధనంబు నాతిలో
జప్పున ద్రోసి యయ్యొ చెయి ♦ జారెగదా యని తెల్లమోముతో
ముప్పిరిగొన్న శోకమున ♦ బుద్ధిచలింపగ వెర్రియెత్తి న
ట్లొప్పుచు నున్నవాడ వది ♦ గో ముఖవ్యాఘ్రరియే వచించెదున్.

రాము—వత్సలారా ! నిక్కము వచించితిరి. మిమ్ము గాంచినది మొదలు నాకధికానురాగము కలిగియున్నది. ఒక్కసారి నామోహము దీర కౌగలించుకొననిండు. (కౌగలించుకొని కన్నులనీరు పెట్టుకొని) ఆహా ! యీకుమార పరిష్వంగసౌఖ్యము నాకు మిక్కిలి చల్లనైనదికదా.

మ. బళిరా, యీసుకుమారగాత్రుల పరి ♦ ష్వంగోద్భవామేయ శీ
తలసౌఖ్యంబు మదీయమానసిక సం ♦ తాపంబు జల్లార్చె, గం
ధిలకృష్ణాగరు కర్పూరోల్లసిత ప ♦ న్నీరాంబుసౌగంధికా
కలపంబట్టుల, నేమికారణమొ నా ♦ కష్టంబు లిం కారునే.

(ఇద్దరిని ముద్దుబెట్టుకొనుచు) ఆహా ! యెంతమధురము.

కుశు—అయ్యా ! ఇక నీవెర్రిపనులు చాలించుము. మేము పోవలయును.

లవు—అయ్యా ! ఎందులకు మమ్మిట్లు ముద్దులాడి యానంద బాష్పము లొలికింతువు ?

రాము—చిరంజీవులార ! నాబిడ్డ లిట్లుందురుకదాయని.

కుశు—ఓహో ! ఇక భవిష్యత్పుత్రుల నుద్దేశించియా, నీవంటి వెఱ్ఱివానికి బిడ్డలొకటి తక్కువయయ్యెనా. తమ్ముడా, రమ్ము పోవు దము. మనయాటలఁ జెడగొట్టినాడు.

కుశ—లవు—(ఇద్దఱు నిష్క్రమించెదరు)

రాము—అక్కటా! నిండుచూలాలిని భయంకరాటవులవిడిచి వచ్చిన క్రూరాత్మునకిట్టి బిడ్డలు ప్రాప్తించుదురా? నాకొఱకై విమానమువేచియున్నది. శంబూక వధార్థమే పోవలయును. (నిష్క్రమి)

---

2 రంగము:—పర్ణశాల. (సీత ప్రవేశించును.)

సీత—అక్కటా! ఆశ్రీరామచంద్రునిముఖమండలసందర్శనము నాకు గఱవై పోయినదికదా!

గీ. ఎన్నినాళ్ళాయె ననుబంపి ♦ యీవనులకు
తిరిగిచూడడు క్షేమంబు ♦ తెలిసికొనడు
అపయశము బాపుకొనుటకె ♦ యైననన్ను
దలపకుండునె, నాధుడు ♦ దయదలంచి.

కావున కేవల మపవాదబాపుకొనుటకేకాదు నన్నడవులకు

కావున కేవల మపవాదబాపుకొనుటకేకాదు నన్నడవులకు దోలుట. నావిషయమై యామహానుభావున కేదో విముఖభావమే యున్నదని తలంచెదను.

గీ. నిండుచూలాలి దయమాలి ♦ కొండలందు
విడచితిమి బ్రతికెనో లేదో ♦ యడవులందు
ననుచు నుంతయు దలపోయ ♦ డక్కటకట
యేమిసేయుదు దుర్విధి ♦ నేమనందు.

కృష్ణవేణి—(ప్రవేశించి) అమ్మా, జానకీ! వీరులైన కుమారుల గాంచియు నిట్లుపొగిలెదవేల యూరడిల్లుము.

సీత—భగవతీ, కృష్ణవేణీ, విచారముకాక, యానందమెట్లు కలుగునమ్మా.

ఉ. సంతతి యెంతయొప్పినను ♦ సంపదలన్ దులదూగుచుండినన్
గాంతకు దోడునీడగుచు ♦ గాచెడుదైవముకాదె, భర్తనా

యంతటిదానివిగా మగ డ ♦ నాదరవృత్తి జరింప జానకీ
వంత గృశించుచుంట దల ♦ వంపులుకావొకో యెంచిచూచిరా.

కృష్ణ—జానకీ! లోకమందలి యపవాద మంతరించువఱకును రామచంద్రునికరుణ నీవిషయమై కనపడదు. నీయారడి యెప్పుడు వోవునా నిన్నెప్పుడు స్వీకరింతునా యని యారఘూత్తముడును పరిపరి విధముల దపించుచుండును.

సీత—భగవతీ, అది నిశ్చయమేకాని,

ఉ. ఎన్నడు లోకనింద సమ ♦ యించునో, జానకి నిష్కళంకయే
యన్నవదంతి యీధరణి ♦ యందున నెన్నడు ప్రాకునోకదా,
కన్నకుమారులన్గలిసి ♦ కాంతుని పీఠముపై సమస్త సం
పన్నత నెప్పు డందుదునో ♦ పల్మరుచిత్తము తల్లడిల్లెడున్.

(వాల్మీకి ప్రవేశించును.)

సీత—తండ్రీ! ప్రాచేతనమునీంద్రా! నమస్కరించుచున్నదాన.

వాల్మీ—బిడ్డా, అచిరశుభప్రాప్తిరస్తు.

సీత—మహాత్మా!

చ. జనకుడు తండ్రి కాడు ముని ♦ సత్తమ, మత్పిత నీవెసుమ్ము కా
ననముల దిక్కులేక మర ♦ ణంబును బొందగనున్న నన్ను మీ
యనుపను సత్కృపన్మనిచి ♦ యాత్మజులన్ దయచేసినారు రా
ముని దయవచ్చు మార్గమును ♦ బొల్పుగదెల్పి సముద్ధరింపవే.

వాల్మీ—అమ్మాయీ జానకీ!

ఉ. చింతలబోకుమమ్మ కుల ♦ శేఖరులైనకుమారు లేగి నీ
వంత దొలంగజేయు నప ♦ వాదముమాయును రామచంద్ర సీ
మంతినివై సతీ వితతి ♦ మండనవై వెలుగొందు దీవు ర
వ్వంతమదిన్ సహించుము స ♦ మస్త సుఖంబులు నీకెచేకురున్.

సీత—స్వామీ! పతినిరాకరించెనని కొంతవినా నాకితరచింత యేదియులేదు. పుట్టినయింటికంటె మీచెంత నాకెక్కుడు సుఖముగ నున్నది. మరియు,

గీ. కనుట నావంతేకాని నా ♦ కనిన సుతుల
బెంచి యుపనీతులుగను గా ♦ వించినారు
వేదవిదులుగ దివ్యాస్త్ర ♦ వేత్తలుగను
సేయరేమీరు నాపైన ♦ మేయకరుణ,

వాల్మీ—అమ్మాయి! మీవంటి జగత్పితరులపై ప్రేమయుంచుట గొప్పకాదు. నీతనయులు దివ్యతేజస్సంభూతులు. సర్వకళలును స్వయముగవచ్చి యాకుమారుల వరించినవి. అంతియెకాక,

గీ. నవ్యఛందస్సు నాదన ♦ నంబునుండి
వెడలి తొలుతనె శ్రీరామ ♦ విమలచరిత
కవిత నొనరించునట్టి భా ♦ గ్యంబునాకు
గలిగె నాపూర్వపుణ్యంబు ♦ కలిమివలన.

సీత—మహాత్మా! తమరు రచించిన రామాయణమును వత్సలుపఠించుచుండ రోమాంచము కలిగి ప్రపంచమునే మఱచుచుండుదానను. స్వాతివానచినుకులు శుక్తిలోబడి ముక్తాఫలములైనట్లు మీచ చరిత్రము మీజిహ్వనుండి వెలువడి విమలంబైనది. స్వామీ! మీరెరుంగని వ్రతములు లేవుకదా! నానాథునకు నాయందు దయవచ్చునటుల నొక్క వ్రతముజేయించి నాధుడు నన్నుగొనిపోవునట్లుచేయుటకు వేడుచున్నాను.

వాల్మీ—బిడ్డా! భర్తృసంయోగవ్రతమొకటిగలదు. కానియందులకై బంగారుతామరపువ్వులుకావలయును. అవిదొరకుటదుర్లభము.

సీత—అయ్యా! అవి యెందులభించునో?

వాల్మీ—అవి శ్రీరాముని పుష్పోద్యానముననున్నవి.

సీత—ఔను. స్మృతికివచ్చినది. కాని,

గీ. రాముచేపీడబడిన నీ ♦ రామకకట !
పైడితామరలెట్లు సం ♦ ప్రాప్తమగును
అందులకు సర్వారాల నే ♦ నైతినేని
స్వర్ణకమలంబులేల యీ ♦ వ్రతమదేల.

లవు—(ప్రవేశించి) తాతా ! నమస్కారము. తల్లీ, వందనము లమ్మా !

వాల్మీ—చిరంజీవి వగుదువుకాక.

సీత—బిడ్డా! ఆయుష్మంతుడవుకమ్మ.

లవు—తల్లీ ! నీముఖము నేడేమో విచారమును సూచించు చున్న దేమమ్మా.

సీత—వత్సా ! నా బ్రతుకే విచారముకదా.

లవు—అదేమమ్మా ! అట్లు పలుకుచున్నావు ?

గీ. సర్వజగములశాసించు ♦ శక్తికలుగు
పుత్రులిద్దర ముండంగ ♦ బొగులనేల
తాతచెప్పినవిద్య వి ♦ ఖ్యాతిగాగ
మేము నీచింత నుడువం ♦ గలేమె తల్లి !

సీత—హా ! కుమార ! మీరుచేయలేకున్నను చేసినంతయానం దముగ పల్కుటి వంతియేచాలునోయి.

లవు—వెర్రితల్లీ ! అదేమిమాట ? చేయలేకున్నను యని సం దేహించి పలుకుచున్నావు. నీవు మా ప్రభావమెఱుగవు చెప్పెదవినుము.

కం. ఉరగేంద్రు కోరలైనను
బెఱికెద మంభోధినైన ♦ వెస హరియింపన్
బఱపెద మస్త్రంబుల భీ
కర యమగతినైన మాన్ప ♦ గలుగుదుమమ్మా.

సీత—నాయనా ! (కౌగిలించుకొని)

గీ. కన్నకొడుకులు తల్లుల ♦ కష్టములను
దీర్తుమమ్మరో యనియెడి ♦ తేనెపల్కు
వినుటకంటెను భాగ్యంబు ♦ వేఱెకలదె
మాటచేతనె నావంత ♦ మాసిపోయె.

లవు—అమ్మా ! మాటలకేమిగాని నీవిచారమునకు గారణము జెప్పుమా !

సీత—కుమార ! నాకేమికావలసినను తెచ్చియిచ్చెదవా ?

లవు—ఇంకను సందియమా ? వేగచెప్పుము.

సీత—బిడ్డా ! నేనొకవ్రతము చేయవలసియున్నది. అందులకై బంగారు తామరపూవులు గావలసియున్నవి.

లవు—అమ్మా ! అవి యెక్కడనుండును.

వాల్మీ—వత్సా ! అవి శ్రీరాముని పుష్పోద్యానమున నున్నవి.

లవు—అట్లైన నేను తెచ్చుటకు సందియమేమి ?

సీత—ఏమి, తస్కరించి తెచ్చెదవా.

లవు—తస్కరించుటకింత చేతకానివాడనుకాను. నేనెట్లుతెచ్చెదనో చెప్పెద వినుము.

చ. అనుజులతోడ నాహనుమ ♦ దాదులతో రఘురాముడాహవం
బున కరుదెంచినన్ దృణస ♦ మూహము వాయువు పారదోలురీ
తిని నిముషంబులో శరహ ♦ తిన్ భువిగూలిచి స్వర్ణపద్మముల్
బనివడి దెచ్చువాడ లవ ♦ పౌరుష మంబరవాసు లెన్నగన్.

వాల్మీ—(తనలో) నావిద్యలు సుక్షేత్రమందు జల్లిన బీజములవలె సఫలమగుగాక (ప్రకాశముగ) వత్సా ! మేలు ! మేలు !

సీత—ఆయుష్మంత ! లవకుమార !

గీ. బాల్యచాపల్యమున నిట్లు ♦ పలుకుచుంటి
వన్న ! శ్రీరాము విక్రమ ♦ మెన్నవశమె

సమర కర్కశు లసమాన ♦ శౌర్యనిధులు
సాహసము వల దారామ ♦ చంద్రుమీద.

లవు—తల్లీ ! వారెట్టి శౌర్యనిధులైనను,

ఉ. ఎప్పుడు పౌరులాడుకొను ♦ నెంగిలిమాటలనమ్మి సీతపై
తప్పుగటించి గర్భవతి ♦ దారుణకానలపాలు చేసెనో
యప్పుడె రాము తేజము స ♦ మస్తము భగ్నమండిపోయె న
న్నిప్పుడు జైత్రలక్ష్మి వరి ♦ యించుట శంకయె నమ్ముమమ్మరో.

సీత—(తలవంచి యూరుకొనును)

వాల్మీ—వత్సా ! లవకుమార ! నేను నీకు రామాయణమందలి యుత్తరకాండము చెప్పలేదే! సీత నడవులవిడచెనని నీవెట్లు తెలిసికొంటివి?

లవు—కొందరు చెప్పగా వినియున్నాను.

సీత—నాయనా ! సీత యెందున్నదో యెఱుంగుదువా ! ఆమె నెన్నఁడైన జూచితివా !

లవు—పాప మామె గర్భవతియై యేయడవుల నిడుమల గుడుచుచు హా రామా ! హారామా ! యని యడలుచున్నదో నాకేమి తెలియును. ఆమెను నేను చూడలేదు.

సీత—పోనిమ్మా ! శ్రీరామచంద్రు నెన్నడైనచూచియుంటివా

లవు—శ్రీరాముని చూడలేదు కాని కేవలము శ్రీరాముని బోలిన నొకవెఱ్ఱివానిని జూచితిమి.

వాల్మీ—ఆవెర్రివాడు శ్రీరాముని బోలినవాడని యెట్లు తెలిసికొంటివి.

లవు—తాతా ! అట్లనెదవేల ? నీవు రచించిన రామాయణములో శ్రీరాముని లక్షణములను గుఱించి మేము చదువలేదా !

సీత—బిడ్డా ! ఎట్లు చదివితివో చెప్పుమా !

లవు—శ్లో॥ రామంశ్యామల కోమలాభ్రవపుషం రాజీవపత్రాననం
లక్ష్మీస్థానవిశాలవక్షమమలం లావణ్య వారాన్నిధిం

ధాత్రీరక్షణదీర్ఘబాహుయుగళం ధర్మప్రతిష్ఠాకరం
భక్తాభీష్ట వరప్రదానహృదయం భవ్యం సదాహంభజే.

అని చదివితిమి. ఇందలి లక్షణములకు సరిపోయిన నొక పిచ్చి వానిని క్రోతికొమ్మచ్చులాడుచు నన్నయు నేనును జూచితిమి.

వాల్మీ—వత్సా! అతడు వెర్రివాడని మీరెట్లు తెలిసికొంటిరి.

లవు— తనపేరే వెర్రివాడట ముఖవైఖరియుగూడనట్లేయున్నది

సీత—కుర్రా! అతనితో మాట్లాడితిరా! ఆతడేమనినాడు.

లవు—అమ్మా! మమ్ముజూచి మీరెవ్వరి పిల్లలు? ఎందు జదువుకున్నారు? మీతల్లిదండ్రులు సజీవులై యున్నారా! వారి పేరేమని యడుగుచు గన్నులనీరు తుడిచికొనుచు మమ్మాలింగనము జేసికొని ముద్దులాడి తనలో తానేదియో పలవరించుచుఁ బోయినాడు.

వాల్మీ—వత్సా! మీరేమని ప్రత్యుత్తర మిచ్చిరి.

లవు—మీమనుమలమనియు మీకడనే జదివితిమనియు మా తల్లిపేరు పావని యనియు మాతండ్రి దేశాంతరగతుడయ్యెననియు జెప్పితిమి.

సీత—(తనలో) అక్కటా! ఇంత గ్రుచ్చిగ్రుచ్చి యడుగువాడు రామచంద్రుడుకాక యన్యుడుండునా! (ప్రకాశముగ) బిడ్డా! అత డింకేమైన నడిగెనా?

లవు—అమ్మా, వెర్రికి వేయివిధములన్నట్లు గద్గదకంఠుడై పలుమాటలు మమ్మడిగినాడు. సదుత్తరము జెప్పితిమి. వాని ప్రశంస మనకేల కాని నేనిపుడేపోయి స్వర్ణకమలముల దెచ్చెద నెన్నికావల యునో చెప్పుడు.

వాల్మీ—పావనీ! నీవు బాలుని విషయమై సంకోచపడక పోనిమ్ము. లవకుమార, ఆవ్రతము తొమ్మిది దినములు చేయవలసి యున్నది. మొదటి దినమున దొమ్మిదిఁ మలిదినమున పదునెనిమిది.

ఇట్లే ఒకనాటికంటె మరియొకనాడు తొమ్మిది చొప్పున హెచ్చుగా కావలయును.

లవు—తాతా, ఇదే నమస్కరించుచున్నాను. నన్నాశీర్వదించి యనుపుడు. అమ్మా! ఇదే నమస్కారము. వేగపూవులు తెచ్చెదను.

వాల్మీ—వత్సా! పోయినచోట విజయమునుగాంచి సుఖమున వచ్చెదవుగాక.

సీత—బిడ్డా! విజయలక్ష్మితో స్వర్ణకమలముల దెచ్చెదవుగాక.

(లవు, వాల్మీకి, సీత, నిష్క్రమించెదరు.)

---

## 3 రంగము—పుష్పోద్యానము.

లవు—(ధనుష్పాణియై ప్రవేశించి) ఆహా! యేమి యీ యుద్యానవనరామణీయకము. మిక్కిలి యాహ్లాదకరముగ నున్నదే!

చ. చదువుటెకాని కావ్యముల ♦ జక్కగ నేలివనాంతరప్రభల్
ముదముగ జూడలేదెపుడు ♦ ముచ్చటకల్గెడు నీవనంబు సం
పద దిలకింపగా నడవి ♦ పల్లెలవారికి రాజ్యభోగముల్
గదియుటే యబ్బురంబు కద! ♦ కన్నులపండువయయ్యెనద్దిరా!

ఎన్ని దినంబులు విలోకించినను, యీపుష్పోద్యాన శృంగారము తనివితీరదుకదా! అల్లదే బాలభాస్కరకాంతులు ప్రచురించుటచేమరింత వన్నెకెక్కి తళతళలాడుచున్న రేకులుగలిగిన బంగారు తామరపూవులు లక్ష్మిని బంగరుతొట్టెలోబెట్టి మారుతసేవకుం డూచుచున్నాడో యనునట్లు గాలికిగదలుచుతుమ్మెదలకందక యాకొలనులో నెట్లొప్పుచున్నవో కోసికొనిపోయి మాతల్లి పావని కొసంగెదనుగాక. (నడచును)

భటు—(ప్రవేశించి) ఆ! ఆ! ఆగుమాగుము యెవ్వడవునీవు?

లవు—ఏమి నాపేరు నీకెందులకు.

భటు—ప్రవేశింపరాని యీకొలనిలో ప్రవేశించుటచేత.

లవు—బంగారు తమ్ములకై దిగుచుంటిని.

భటు—నీవు స్పృశింపరాదు. వేగనావలకుబొమ్ము. ఇది శ్రీరామ చంద్రుని యాజ్ఞలోనిది. చిన్నతనముచేతఁ దస్కరింపవచ్చితివి. తెలిపితిని కావున వేగబొమ్ము.

లవు— నేను కమలములదీసికొనక పోవువాడనుకాను. శ్రీరాముడుకాదు. రాముని ముత్తాతవచ్చినను నన్నడ్డుకొనలేరు.

భటు—ఓహో! చూపులకు బిల్లడవైనను మాటలు పెద్దవే చెప్పుచుంటివే. మునిబాలకా! ఆశ్రీరామచంద్రుని పరాక్రమ మెరుంగక యట్లు పలుకుచున్నావు. చెప్పెద వినుము.

గీ. సకలరాక్షస నిచయంబు ♦ సంహరించి
మునులబాధల దీరిచి ♦ భూమినెల్ల
నిష్కళంకత నేలెడు ♦ ముష్కరుండు
రాముపై గత్తిగట్టగా ♦ రాదునీకు.

మఱియు నిన్ను జూచిన నాకు ముచ్చటయగుచున్నది. నీయందు నాకు బ్రభుభక్తి పొడముచున్నది. నీవు నావెంటవచ్చితివేని యారామచంద్రుడు నిన్ను గౌగిట నాదరించి నీకు గావలసినన్ని పైడితమ్ముల నొసంగును. కావున నీవె సాహసింపకుము.

లవు—ఓరి భటుడ!

గీ. గర్భభారాలసను తన ♦ కాంత నడవి
విడుచుపట్టున రాముని ♦ విక్రమంబు
పౌరుషంబెల్ల యుపయోగ ♦ పడెను కాని
నన్ను గెల్వగ దచ్ఛక్తి ♦ సున్నసుమ్మి.

భటు—అయ్యో! నిష్కారణము సమరమేల? యొక్కసారి రామచంద్రు నంతికమునకు రమ్ము. నీకు గావలసిన తామర లిప్పించెద నంటిని కదా?

లవు—ఓరీ వనరక్షక !

గీ. యాచకుడగాను మీరాము • నాశ్రయింప
సిరికివ్వాడనుగాను సం • గర మనంగ
రాముడేకాదు పుర హర • బ్రహ్మముఖులు
వచ్చినను గూల్చికొంపోదు • బద్మవితతి.

భటు—అటులైన మానవా ?

లవు—మానను.

భటు—నీవు చిఱుతవాడవగుటచే నింతవఱకు జెప్పితిని. నీవు వినకున్న నాగదచే నిన్ను మూర్ఛిల్లజేసి మాప్రభువుచెంతకు గొంపోదును. (గదయెత్తి మీదికివచ్చును.)

లవు—సరే, యీవాయవ్యాస్త్రమున నీవు రామునిపాదముల బడుదువుగాక. (శరము ప్రయోగింప వాడు కొట్టుకొనిపోవును.) ఇంత టితో నేను కమలముల గొనిపోరాదు. వీని యవస్థగాంచి రాముడు మఱిల కొందఱ బంపును. వారినిగూడ నెగురగొట్టి సంపూర్ణ జయమును గాంచి తరువాత కృతకార్యుడనై యాశ్రమమునకు బోవుదును. (ముందుజూచి) అదుగో మరల నొక్కదండు వచ్చుచున్నది. వారిని నాసమక్షమునకు రాకమునుపే యీయస్త్రముచే దూలించెదనుగాక. (బాణము ప్రయోగించును.) ఇక జయమందితిని. నేటికి గమలముల కొంపోయెద. ఇట్లే ప్రతిదినమునువచ్చి వచ్చినవారి దూలించి కొం పోవుదును. (కమలముల గోసికొని పోవును.)



# ల వ కు శ.

## పంచమాంకము.

రంగము—వాల్మీకాశ్రమము.

(వాల్మీకి సీతయు ప్రవేశించెదరు.)

వాల్మీ—అమ్మా పావని ! మన లవుం డింకను రాలేదని నీవు శంకింపకుము.

గీ. హరిహరాదులైన ♦ నతని జయించుట
కల్ల, నాదుమాట ♦ పొల్లుకాదు
ఉల్లమందు నీవు ♦ తల్లడ పడకమ్మ
పద్మములను గొంచు ♦ వచ్చు నిపుడె.

సీత—తండ్రీ ! మరేమియు లేదు కాని,

గీ. కుశుని సాయములేక యా ♦ కుర్ర డొకడె
పద్మముల దేవపోవుట ♦ భయముకలిగె
రామశాసనమును దాట ♦ రా దెవరికి
గాన నేమయ్యెనోయని ♦ కలగుచుంటి.

వాల్మీ—లవు డొక్కడేగినను భయములేదు.

కుశు—(ప్రవేశించి) అమ్మా ! తమ్ముడింకను రాలేదా !

సీత—బిడ్డా ! రాలేదోయి. నీవు సహాయమున్న నాకింత భయము లేకపోవునుగదా !

లవు—(ప్రవేశించి) తల్లీ ! స్వర్ణపద్మంబులివే తెచ్చినాను. (సమర్పించును.)

కుశు—తమ్ముడా ! రామసైన్యమును నిరోధించితివా ?

లవు—నిరోధించి వారందర నొక్కొక్కొలచే రాముని చరణములమీద బడునట్లు గొట్టితిని.

కుశు—వారు రామునిగూర్చి నీతోనేమైన పల్కిరా.

లవు—పలికినారు. ఈవిధముగ సమాధానమును జెప్పితిని.

గీ. గర్భభారాలసనుతన ♦ కాంతనడవి

(అను పద్యమును మరల జదువును.)

కుశు—బలే బలే తమ్ముడా ! చక్కని యుత్తరమిచ్చినావోయి.

వాల్మీ—వత్సా, లవకుమార ! అతనిభార్య నతడు విడచిన నీకంత కష్టమేల.

లవు—తాతా ! ఎవరి భార్యయైననేమి. దూరమాలోచింపక దయారసమూర్తి యని ప్రఖ్యాతిని వడసియు నిట్లు కాఠిన్యమును వహించినాడనిన నాకు గోపము కాని వేఱొండుకాదు.

కుశు—తమ్మునిమాట సత్యము. సహజకఠినాత్ములట్లు చేసినా రన్న నాగోడవ యెవరికి కావలయును.

సీత—(కుమాళ్ళను కౌగిలించుకొని) వత్సలార !

గీ. అనుపమవియోగ ♦ వహ్నిచే నడలుచున్న
నన్నుగావగ బుట్టిన ♦ చిన్నలార
వినత గరుడునిచే జెఱ ♦ విడచినట్లు
లేను మీకతమున గష్ట ♦ మీగుదాన.

కుశు—అమ్మా ! దేశాంతరగతుడైన మాతండ్రి నిగూడ నెట్లో కనుగొని తెచ్చెదము విచారింపకుము.

పౌరవృద్ధుడు—(ప్రవేశించి) ప్రాచేతసమునీంద్ర ! శ్రీరామచంద్రుం డశ్వమేధయాగముసేయునట. తమరువచ్చి సంకల్పము జేయింపుడని నన్ను బంపవచ్చితిని. మీరు మీశిష్యులతో రమ్మని నాముఖమున బ్రార్థించినారు.

వాల్మీ—పౌరవ్యా, అట్లేవచ్చెదనని చెప్పుము. పొమ్ము.

పౌర—చిత్తము. (నిష్క్రమించును.)

వాల్మీ—కుశలవలారా! మీరునావెంటవచ్చి నాకవిత్వము సార్థకమగునట్లా సభలో రామాయణము గానముసేయవలెను.

కుశ—మహాభాగ్యముకదా!

లవు—తాతగారిమాట శిరసావహించినాను.

వాల్మీ—యీ వ్రతమును సాంగముజేయుదమురండు.

(అందరు నిష్క్రమించెదరు.)

---

## 2 రంగము—సభాభవనము.

(రామవశిష్ఠులు మఱికొందరు ప్రవేశింతురు.)

రాము—గురువర్యా! వశిష్ఠమునీంద్ర!

చ. ధరణి ప్రశాంతము న్గలిగె ♦ దానవవంశములంతరించె బా
మరకులమున్ హరించె ముని ♦ మండలి భీతియొకింత లేక సం
చరణముసేయుచుండె ఋషి ♦ సత్తమ, సంతతశంకరార్చనా
పరులవధించుటన్ గలుగు ♦ పాతక మింకహరించుటెట్లొకో.

వశి—రఘుకులతిలకా!

గీ. దుష్టసంహారణంబును ♦ శిష్టజనుల
బ్రోచుటకుగాదె, నృపులు ప్ర ♦ భూతులగుట
కాన నీకిందు సుంతయు ♦ గలుగ దఘము
క్షితిని నీజన్మమది జగ ♦ ద్ధితముగాదె.

కావున నీవందులకై యోజింపనవసరములేదు.

రాము—గురువర్యా! మీరానతిచ్చినది సత్యమేకానియీరావణాదులు శంకరపూజాతత్పరులు. వారలవధించిన పాతకము వోవుటకై యుపాయము నానతీయుడు.

వశి—ఉపాయమున కేమున్నది. నీతలచిన ట్లశ్వమేధయాగ మును సేయుటయేకాని,

గీ. జానకీదేవిలేకుండ ♦ జన్న మెట్లు
పరిసమాప్తిని బొందునో ♦ పార్థివేంద్ర !
కానవాల్మీకిముని సన్ని ♦ ధానమునను
వెలయు జానకినిటకు ర ♦ ప్పింపుమయ్య.

రాము—గురువర్యా ? అదెట్లుపొసగును. అపయశమింకను నం తరించినట్లగుపడదుకదా.

మ. పలుగాకుల్ నడిచేసిరన్న త్రపచే ♦ బద్ధాక్షివై దేహి కా
నలలోఁ డింపగబంపి నేనిటను న ♦ న్యాసిస్థితిఁగట్టినై
కలుషం బార్చుకొనంగనెంచి యొక య ♦ జ్ఞంబాచరింపంగనే
కలనఁ బిల్వగబంతు నారడియు లో ♦ కంబందుజల్లారదే.

స్వామీ ! పురాకృత దోషవశంబునంజేసి భార్యనుకలిగియులేని వాడనైతినికదా. ఆమెను బిలువకుండ మరియొక సాధనంబును యోజింపుడు.

వశి—భార్య యప్రత్యక్షమైనపుడు సువర్ణముతో భార్యావిగ్రహమును జేయించి ప్రక్కనుంచుకొనికార్యమును గడుపుకొందురు.

రాము—అటులైన సరిమె లక్ష్మణా, నీవుపోయి బంగారుసీతను చేయించి తెప్పించుము.

లక్ష్మ—చిత్తము. (నిష్క్రమించును.)

వాల్మీకి కుశలవులతో బ్రవేశించును.)

రాము—(లేచి) స్వామీ! ప్రాచేతసమునీంద్ర! అభివందనముల సేయుచున్నాను. యీయుచితాసనము నలంకరింపుడు.

వాల్మీ—రామచంద్ర ! యాగఫలప్రాప్తిరస్తు.

వశి—వాల్మీకి సంయమీంద్ర ! యీబాలకులెవ్వరు ?

వాల్మీ—వీరు నాశిష్యులు, రామభద్ర,

గీ. యజ్ఞభోక్తవు కర్తవు ♦ యజ్ఞమూర్తి
వీవుసచరాచరంబుల ♦ సృష్టిసేయ
గావ సంహార మొనరింప ♦ గర్తవీవు
నిన్ను దీవింప మేమెంత ♦ సన్నుతాంగ.

రాము—మహాత్ముల యాశీర్వచనఫలము. ప్రాచేతసమునీంద్ర భవాదృశుల యాగమనంబునజేసి పవిత్రుడనైతిని. మీరుసమక్షమున నుండి నాయొనరించు హయమేధంబునకు సంకల్పము జేయించెదరని ప్రార్థించుచున్నాడను.

వాల్మీకి—అటులే చేయించెదను.

వశిష్టు—ఆర్యా!

గీ. అజునిముఖమున వేదము ♦ లట్లుమీ ము
ఖంబునను క్రొత్తచందస్సు ♦ కలిగెనంట
యిట్టినభమీరు చేసిన ♦ యట్టికృతిని
వినగజేయవె, యానంద ♦ విభవమలర.

వాల్మీ—వశిష్ట మునీంద్ర! అటులే పాడించెదను, వత్సలార యీరామచంద్రుని చరిత్రమును నారదునివలన నేర్చిన గానపణితితో బాడుడు.

కుశు—మహాప్రసాదము.

రాము—(తనలో) ఈబాలకులను నేను మున్నొకనాడుశంబూకవధార్థ మరుగునప్పుడుచూచి సంభాషించియుంటిని. అక్కటా, నా యర్ధాంగి జానకి బిడ్డలవలె దోచుచున్నారు. నిక్కమే యయినయెడల నెంతయు కృతార్థుడను కదా?

గీ. నాదురూపమె పుణికికొ ♦ న్నారు వీరు
లీలజూడగ రాగాబ్ధి ♦ వేలదాటె

గొడుకులని కౌగలింతునా ♦ మదుకుచేత
నన్ను జూచిన వీరెల్ల ♦ నవ్వకున్నె.

అంతియెకాక సీతాముఖలక్షణములుకూడ వీరియందచ్చునగుద్ది నట్లగపడుచున్నవి. మీతల్లిపేరేమన జగన్మాతయనియు బుణ్యయనియు పావనియనియు జెప్పినారు. ఆనామములు విశేషణములుకాని నిజమైననామము తెలియదయ్యె. అన్నన్నా! ఈయదృష్టహీనున కింతటి సుందరాంగులగు కొడుకులు కలుగుదురా!

భటుడు—(రామునితో జనాంతికముగ) మహాప్రభో! బంగారు తామరలకై వచ్చి మమ్ము మీచరణముల బడునట్లు కొట్టిన బాలుడీ రెండవవాడునుడీ.

రాము—ఓయీ! ఆ ప్రశంస యిప్పుడేల? యూరకుండుము.

లవు—అన్నయ్యా! రామాయణమును బాడుద మారంభించుము.

లక్ష్మ—(ప్రవేశించును.)

కుశు—(జనాంతికముగా లవునితో) తమ్ముడా! నాడుమన కడవిలో గనుపించి వెర్రివాడనని చెప్పి కన్నీరుపెట్టుకొని మనల ముద్దాడిన వాని చిహ్నము లీశ్రీరామమూర్తియందు పొడకట్టుచున్నవి సుమీ!

లవు—అవును. మనలగాంచి యిపుడును తనలోదానేదియో యువ్విళులూరుచున్నవాడు.

వాల్మీ—వత్సలార! ఇకరామాయణమును బాడుట కారంభించుడు.

కుశు—చిత్తము. ఓమహాప్రభో! సభ్యులార! ముందు మాగురువైన వాల్మీకిమహర్షి ముఖమునుండి వెలువడిన నవ్యఛందోరూపకమైన కవితా సారస్వతము బాడెదము వినుడు.

శ్లో. మానిషాద ప్రతిష్ఠాంత్వ మగమశ్శాశ్వతీస్సమాః
యత్క్రౌంచమిథునాదేక మవధీః కామమోహితమ్.

లవు—ఇదే రామాయణ పుణ్యచరిత్రను బాడెదము.

పాట కాంభోజిరాగము—ఆదితాళము.

శ్రీరాముని చరితామృతము - జేరీ త్రాగరేమీరు ॥శ్రీరా॥

1. తరణికుల చంద్రుడైన - దశరథభూమీపాలునకు
నిరవొంద రామలక్ష్మణ - భరతశత్రుఘ్నులు జనియించిరి ॥శ్రీ॥

2. తాటకీసుబాహుముఖుల - గీటడచి కౌశికజన్నము బా
హాటముగానేలి పాదరజమున - మోటురాతి నహల్యజేసిన॥శ్రీ॥

3. శివునిచాపమును విరచి - సీతను కళ్యాణమయి, భా
ర్గవుని గర్వమునుహరించి - క్రమ్మర నయోధ్యకేగిన ॥శ్రీ॥

4. గురునియానతి రాజ్యము - భరతునకొసగి లక్ష్మణు
తరుణిసీతా ! గొనుచు వనుల - దిరుగ వ్రతియైపోయినట్టి ॥శ్రీ॥

5. పంచవటియందు సీత - వంచకుండై రావణుడు హరి
యించ హా సీతా హా సీతా - యంచుగాన లెల్లరోసిన ॥శ్రీ॥

6. శోకమునదిరిగి ఋష్య - మూకమున సుగ్రీవాహనుమం
తాకపులాతో స్నేహముజేసి - వీకవాలిని దునుమాడిన ॥శ్రీ॥

7. వానరసేనలతోడ - వారాశిని బంధించి
దానవసేనలతోడ - దశకంఠూ నీరూపుమాపిన ॥శ్రీ॥

8. అలంకాసామ్రాజ్యమునకు - అవిభీషణునిలిపి పుడమి
పట్టి సీతనేలి యయోధ్య - బట్టాభిషిక్తుడైనట్టి ॥శ్రీ॥

వశి—బళి బళీ ! ప్రాచేతమునీంద్రా ! వానచినుకులు శుక్తిలో బడి ముత్యములైనట్లు మీకవితారసబిందువు లీయర్భకుల హృదయమునబడి యమృతబిందువులైనవి.

లక్ష్మ—(తనలో) ఆహా! యీకుమారుల రూపురేఖావిలాస విద్యల నెంతని కొనియాడుదును. కేవలము మాయన్నగారిని బోలియు న్నారు. అంతియెకాక జానకీదేవి ముఖలక్షణముల సొంపు వీరివదనముల గన్పట్టుచున్నది. నాడు మావదినగారిని దోడ్కొనిపోయి వాల్మీకి మున్యాశ్రమారణ్యమునగదా విడచివచ్చినది. ఆమె యీపుత్రుల గాంచియుండదుకదా! అక్కటా! అట్టియదృష్టము మాకు గలుగునా? (రామునివైపు జూచును)

రాము—లక్ష్మణా! మనకట్టి యదృష్టము కలుగదు. ఈబాలు రకు బదివేల వరాల బహుమతి నొసంగి పంపించుము. ప్రాచేతస మునీంద్రా! మీకరుణ నామీద ప్రసరించినందులకు మీకు వంద నముల సేయుచున్నవాడను. మఱియు నీచిరం—(ఆగి) జీవుల గాన విద్యకు సంతసించితిని.

వాల్మీ—ఇపుడుకదా నాకృతికి సార్థకమును నాశిష్యుల జన్మకు సఫలతయును గంటిని.

లక్ష్మ—ఓ ప్రాచేతసశిష్యులార! ఒకసారి నాచెంతకువచ్చెదరా!

కుశు—ఎందులకు ?

లక్ష్మ—మిమ్ముల నాలింగనము జేసికొని బహూకరించుటకు.

లవు—చాలుజాలు, మీపుత్రులమనుకొంటిరా యేమి!

లక్ష్మ—మిమ్ము బుత్రులట్లు చూచుకొని ముద్దాడదప్పా!

కుశు—తప్పా! తప్పున్నరా! యెన్నడును కఠినము నెఱుంగక దయారసమున నొప్పు పవిత్రులమైన మమ్ము మీబోటి మహాపాపు లంటరాదు.

లక్ష్మ—మీగానవిద్యకు మెచ్చితిమికదా!

లవు—మెచ్చెదరుగాక ముచ్చటలతో నేమి ప్రయోజనము.

లక్ష్మ—శ్రీరామునియానతిచే మిమ్ము వరాలచే బహూక రించుటకు.

కుశు—మీరు మెచ్చుకొనుటకు జాడలేదు. మాగురువుగారి సత్కవితకుగదా! నాయకులు శ్రీరాముం డగుటచే నాచార్యునానతిని వారి చరిత్రమును వారికి వినుపించితిని. అంతియేకాదు.

ఉ. కానల దుంపలాకులును ♦ గాయల మెక్కుచు విద్యనేర్చుచుం
మానులమైన మాకుబహు ♦ మానము మీపదివేల్వరాలు కౌ
పీనమొ మౌంజియో గొడుగో, ♦ వేలహితంబగు జన్నిదంబొ, ప్ర
జ్ఞానిధికేల మీధనము ♦ చాలిక మేమది యొల్లమెప్పుడుం.

శ్రీరామ భూపాలుని ప్రమోదమే మాకు బహుమానము చాలును.

రాము—మహాత్మా! ప్రాచేతసమునీంద్ర! మీశిష్యులు సమానవిజ్ఞానులు. ఇకహయమేధమునకు సంకల్పమును జేయించుడు.

వాల్మీ—వత్సలార! మీరిక మన యాశ్రమమునకు బొండు.

కుశు—మహాప్రసాదము. (కుశలవులు నిష్క్రమించెదరు.)

వాల్మీ—రామచంద్ర! యజ్ఞమునకు సంకల్పముజేసి యశ్వమును విడువవలెను. రండుపోదము.

(అందరు నిష్క్రమించెదరు.)



# లవకుశ.

## షష్ఠాంకము.

రంగము—అరణ్యము.

(లవుడు రుచికుడు ప్రవేశించెదరు.)

రుచి—లవకుమార ! అటులైన నీవృక్షము పేరేదియో చెప్పుమా !

లవు—రుచికా ! చెప్పెద వినుము.

గీ. సకలమనుజులకు గట్టు వ ♦ స్త్రంబులైన
భూర్జపత్త్రంబులొసగెడి ♦ భూమిరుహము
కాదె, రామాయణమున వ ♦ ల్కలములంచు
జదువమే నీకు నుంత యో ♦ చనలులేవే.

రుచి—ఓహో ! అలాగుననా ? జ్ఞాపకము వచ్చినది.

లవు—ఈవనస్పతియేదో నీకు దెలియునా ! చెప్పెదవినుము.

గీ. జానకిని గొంచు లక్ష్మణ ♦ సహితుడగుచు
రాము డడవికి జనుచు మా ♦ ర్గమున శృంగి
బేర పురిచెంతను తమాల ♦ విటపినీడ
నిలిచినారని చదువమే ♦ చెలిమికాడ.

కావున నిది తమాల వృక్షము.

రుచి—నాకంటె నీవు చిరుతవాడవైయ్యును నీకు జ్ఞాపకము మెండు.

లవు—అందులకే నీచదువధ్వాన్నమగుచున్నది.

రుచి—లవకుమార ! అదేదో వింతమృగము వచ్చుచున్నది. చూడమా !

లవు—ఓరీ ! పిచ్చివాడా ! అదితురంగముకాదా !

చ. చదువగలేదె మున్ను పశు ♦ శాస్త్రమునందున రెండుకర్ణముల్
పదములునాల్గు దామరవు ♦ వాలము గంఠముమీద జూలునుక్
నదునగు వీపునుంగలిగి ♦ చక్కనికన్నులనొప్పు జంతువున్
విదులుతురంగమంచు బుధి ♦ వీక్షలివాడుదురంచు మిత్రుడా.

(తురంగము ప్రవేశించును.)

రుచి—సఖుడా ! దానిముఖముననేదియో లిఖితపత్రముకట్టబడి యున్నది. కారణమేమైయుండును ?

లవు—ఏదీ చూచెదను. (చదువును.)

కం. వీరపతివ్రత కౌస
ల్యారమణిసుతుడు రాము ♦ డధ్వరవాజిక్
శూరత విడచెను పట్టుడు
పౌరుష ముండినను లేక ♦ వందన మిడుడీ.

ఔరా ! ఏమిది ! ఎంతసాహసము.

కం. తనజననియే పతివ్రత
యనిమనమున గర్వమంద ♦ నగునే ! సాధ్వీ
మణులకు బుట్టినతనయులు
ఘనపౌరుషనిధులు భూమి ♦ గలుగరె ! యాహా.

రుచికా ! ఇట్టిగర్వోక్తిని వ్రాసికొన్న రాముని పౌరుష మేమో చూచెదనుగాక ! దీనిని గట్టివైచెదను. (కట్టును.)

రుచి—వద్దువద్దు లవకుమారా ! దీనివెంట ససహాయశూరులు వచ్చియుందురు. ప్రమాదము సంభవించును సుమీ ! రామునితో బోరాటము బెట్టుకొనరాదు.

లవు—ఛీ ! భీరుడా ! నన్ను వారింపకుము,

గీ. తురగరక్షకులేకాదు ♦ హరిహరాదు
లైననెదిరించి తద్గర్వ ♦ మడచివైతు

పౌరుషము రామునకెకాక ♦ పరులయెడల
గలదొ లేదొ పరీక్షింప ♦ గలరు వీరు.

రుచి—అయ్యయ్యో! నామాటవిని దానిజోలికిపోకుము. అరవి
వంశప్రదీపకులు పరాక్రమము నీవెఱుంగవు.

గీ. ప్రళయకాలాగ్ని దృటికి ♦ నార్పంగవచ్చు
విషఫణీంద్రుని కోఱల ♦ బెఱుకవచ్చు
జలధి నింకింపవచ్చును ♦ జలముపట్టి
కాని రామునకెదురాడ ♦ గలుగరెవరు.

లవు—మఱేమియు భయములేదు. నీవు జడియకుము.
రుచి—చెట్టుగొట్టి మీదవైచికొనుచున్నావు సుమీ!
లవు—అగుగాక.

భటుడు—(ప్రవేశించి) మునిబాలకులార! ఇది శ్రీరామ
చంద్రుని యశ్వమేధతురంగము. దీనినిమీరు పట్టుకొనరాదు. విడువుడు.

లవు—ఔను. అది యెఱింగియుండియే కట్టినాము.
భటు—దానిమొగమున బట్టమును జదివితివా!
లవు—ఆహా! చదివితిమి.
భటు—అర్థమయ్యెనా!
లవు—అర్థమెఱింగియే పట్టినానోయి నిరర్థకుడా!

భటు—(తనలో) ఈబాలు డెవ్వడు చెప్పుమా? రామునినోట
నుండియూడిపడినట్లున్నాడు. (ప్రకాశముగ) అయ్యా! బాల్యపౌరుష
ముచేత బల్లిదుడైన రామునిపరాక్రమమెఱుంగకకట్టినాడవు. దీనివెంట
లక్ష్మణసుతుండు చంద్రసేనుడు మొదలగు మహాపరాక్రమవంతులు
వచ్చియున్నారు. నీవుమునివృత్తిలోనివాడవు. బ్రాహ్మణుడవు. వారితో
జెలగాటము పనికిరాదుసుమీ!

లవు—ఓరీ మూఢుడ! నీవతిచాదస్తముగ మాటలాడకుము.
నేను గుఱ్ఱమునుకట్టినానని నీయబ్బతో జెప్పుకొనుము. మఱియొకసారి
నోరెత్తితివేని తన్నులుతిని పోయెదవు.

భటు — ఓరబ్బ! ఈతడుసింగపుబిల్లవలెనున్నవాడే! మాచంద్ర సేనునితోడ నేజెప్పియంపెదను. (నిష్క్రమించును.)

చంద్రసేనుడు — (ప్రవేశించి చూచి తనలో) ఓహో! యీ బాలకుండు మాయన్నగారి సభాస్థలమున రామాయణమును గానము చేసిన ప్రాచేతసుని శిష్యులలో నొకడుకదా? ఓహో! విద్యలయందే కాక యీయర్భకునకు రణమునందు గూడ సమర్థతకలదే. (ప్రకాశముగ) ఓమునిబాలక! యీసవనాశ్వము నేలబంధించితివి?

లవు — దీనిముఖమున నీవ్రాతగలపట్టము నేలబంధించితిరి.

చంద్ర — రామచంద్రునిమించిన పరాక్రమధనులున్నబట్టుకని.

లవు — అందుచేతనే పట్టితిని.

చంద్ర — అట్లయిన రాముని గెల్వగలవా!

లవు — ఒక్కశరమున.

చంద్ర — మాటలుకావు సుమీ!

లవు — కాదు. పోటరితనమే.

చంద్ర — నీసోదరుడు మఱియొక డుండెనే?

లవు — ఉన్నవాడు.

చంద్ర — నీపేమి!

లవు — ఎందుల కీసందెబేరములు! గుర్రముకావలసిన యెడల నన్నుగెల్చి కొంపొమ్ము.

చంద్ర — అదెంతసేపు? క్షణమాత్రమున గెల్చెదను. నీవు బాలుడవని కొట్టుటకుజేతులాడక సామవాక్యములు జెప్పుచున్నాను.

లవు — ఓహో! అలాగునా! కడుగరుణాశాలివే! నీపేమి? యెవనిపుత్రుడవు?

చంద్ర — నేను లక్ష్మణుని కుమారుడను. చంద్రసేనుడందురు.

లవు—నీవు వేయిచెప్పినను నన్నుసమరమునగెల్చినగాని గుర్ర మును గొంపోవజాలవు.

చంద్ర—

ఉ. కారణమేమొ యీతనిని ♦ గాంచినయంతనె భ్రాతృభావమే
మీరుచునుండెనామదిని ♦ మిక్కిలి శౌర్యము పుట్టదయ్యెనో
కూరిమి తమ్ముడా ! సవన ♦ ఘోటకము న్విడవాడపొమ్ము ని
ష్కారణ మేల ప్రాణముల ♦ గాసిలిజేసికొనంగ వెర్రవై.

లవు—చంద్రసేన !

గీ. భ్రాతృభావమేల ♦ బవరంబునకువచ్చి
సరగ వింటకూర్చు ♦ శస్త్రచయము
చంద్ర—శూరవాడవనుచు ♦ కొంకుచు నున్నాడ
నీదు పీచమడతు ♦ నిక్కమిపుడె.

లవు—అట్లయిన నీపరాక్రమమును జూపుము.

ఇద్దరు—(బాణముల బ్రయోగింపచంద్రసేనుడుపారిపోవును.)

లవు—రుచికా ! అల్లదే చంద్రసేనుడు మూర్ఛనొందినాడు చూచితివా.

రుచి—ఇంతమాత్రమున సంతసింపకుము.

భటుడు—ఓరిబాబు ! చంద్రసేనుడు మూర్ఛిల్లినాడని శత్రు ఘ్నునితో జెప్పివచ్చెదను. (నిష్క్రమించును.)

శత్రుఘ్నుడు—(ప్రవేశించి) ఓయీ మునికుమార ! చంద్రసేనునిమూర్ఛిల్ల జేసితినని గర్వపడకుము. ఈశత్రుఘ్నుని గెల్చితివేని నీపస కనపడును.

లవు—ఓహో ! శత్రుఘ్నుడవా నీవు ? మాటలకేమిరమ్ము రణమునకు.

శత్రు—

ఉ. ఓరికుమార ! నాయెదుట ♦ నోడకనిల్వమము జన్యమందు నా
కూరిమిచంద్రసేను భువి ♦ గూల్చితినంచును గర్వమేల దో

స్సారముగల్గియున్న నను ♦ జయ్యనగెల్వుము నాశిలీముఖా
సారముచే నడంచెదను ♦ శత్రువిదారణు నన్నెరుంగుమా.

లవు—శత్రుఘ్నా ! నీనామము నేతిబీరకాయవంటిది సుమి ?

గీ. ఒక్కలవణాసురునిబట్టి ♦ చక్కడంచి
నంత మాత్రాన మదిగర్వ ♦ మందదగునె
మీాభుజబలము మించిన ♦ మేటిమగలు
లేకపోలేదు వసుధపై ♦ రాకుమార.

శత్రు—మునిబాలక ! నన్ను మించిన మేటిమగ లితరులున్నను నీవుమాత్రము నామ్రో లసిలువజాలవు.

లవు—ఇప్పుడే నీపస కనబడును. నావాయవ్యాస్త్రమున నిన్ను గూల్చెద గాచికొనుము. (బాణమువదలును. శత్రుఘ్నుడుపారిపోవును)

భటు—అక్కటా ! శత్రుఘ్నుడుకూడ కూలెనే. భరతుని దోడ్కొనివచ్చెదను. (నిష్క్రమించి భరతునితో బ్రవేశించును.)

భర—ద్విజబాలక ! శ్రీరామచంద్రుని హయమేధతురంగ మునుగట్టి యాపదను దెచ్చుకొనుచున్నావు సుమి ?

లవు—అట్టి పట్టమునుగట్టి మీారే యాపదపాలగుచున్నారు.

భర—ఈభరతుని క్రూరనిరీక్షణ మాత్రమున బ్రాణముల గోలుపోవనేల ! అశ్వమునువిడచి నావెంటవచ్చితివేని శ్రీరామచంద్రుడు నీకు గావలసిన మఱియొక యుత్తమాశ్వము నీయగలడు. రమ్ము నావెంట.

లవు—ఇతరాశ్వములు నాకవసరములేదు. కాని నీవు సంగ్రామ ముఖకు వచ్చినావన్న నవ్వువచ్చుచున్నది. యేమందువా ?

గీ. ఇంటనుండి చిత్త ♦ మెఱుగక సతతము
రామ, రామచంద్ర ♦ రామయనుచు
భజన సేయుచుండు ♦ వాడవు నీకేల
పోరుగోడవ లేచి ♦ పొమ్ము భరత !

భర—లవకుమార! అందువలన నాకు గోపమురాదు. వాత్స ల్యమే పొడముచున్నది. నామాట విను. నీకోరికదీర్చెదను. ఈతురంగ మును విడువుము.

లవు—అభిమానహీనునకు గోపమేలవచ్చును.

భర—అక్కటా! యీబాలునిజూడగనే నాకు స్నేహభావమే కాని శత్రుభావ ముదయించుటలేదుకదా.

గీ. సమరముడుగుమన్న ♦ సమ్మతింపడు, వాజి
నొసగుమన్న నీయ ♦ డుక్కుమిగిలి
కొట్టజేతులాడ ♦ వెట్టుపోరొనరింతు
ప్రాణసంకటంబు ♦ వచ్చెనకట.

లవు—రామాగ్ని నాశగాసారమున దృటిపో నార్పివై చెదను పలుమాటలాడక బవరమును సేయుము.

భర—అటులైన గాచికొనుము.

ఇద్దఱు—(యుద్ధముసేయ భరతుడు పారిపోవును.)

రుచి—వహావ్వా! భరతుడుకూడా కూలినాడు.

లవు—ఇప్పుడు నీకు గొంచెము ధైర్యము కలిగినదా రుచికా!

(హనుమదాది కపులు ప్రవేశించెదరు.)

హను—లవకుమార! భక్తిపూర్వకమైన నానమస్కారమును స్వీకరింపుము. (చేతులు మొగుడ్చును.)

లవు—ఓయి వలీముఖ! నీపేరేమి?

హను—స్వామీ! నేను హనుమంతుడను. ఈతడు సుగ్రీవుడు, ఈతడు తారుడు.

లవు—రణమునకువచ్చి శత్రువునకు నమస్కరించుట పౌరు షమా!

హను—నీవు నాప్రభువువలె గనబడుటచే నమస్కరించితిని.

లవు—అటులైన నీకు శుభము కలుగును. రామసైన్యమును విడచి నాపక్షముననుండి నాశత్రువులతో రణమొనర్పుము.

హను— కుమారకంఠీరవ! నీకు శత్రువులుకూడ గలరా? జగములన్నియు నీయధీనములే, రాముడు నీవాడే, యీసవనాశ్వము విడువుము. నిన్ను, నీయన్నను నాభుజములమీద నెక్కించికొని శ్రీరాముని యంకపీఠమున గూర్చుండబెట్టెద. ఆమహాత్ముడు మిమ్ము బుత్రులగా జూచికొని సర్వసంపదలు మీకొసంగఁగలడు.

లవు—హనుమంత! ఇదేటి వెర్రిమాటలాడెదవు.

కం. నూరామడ పరిమితిగల
వారాశిని దాటినట్టి ♦ బలమేమయ్యెన్
క్రూరుల దునుమాడిన దో
స్సారమువిడి వందనముల ♦ సల్పగమేలా.

హను—అయ్యా! నాదోస్సారము మాసిపోయెనని కాదు. మీయందు నాకు ప్రభుభక్తి పొడముటచే నిట్లన్నవాడను. కావున నా ప్రార్థన నంగీకరించి యశ్వమును విడువుము.

లవు—అటులైన దీని ముఖపట్టమును జించిపారవేయుము. లేకున్న దీనిని విడచువాడనుకాను.

హను—ప్రార్థించుచుంటినికదా!

లవు—నీమర్కటపు బ్రార్థన నాచెంత బనికిరాదుకదా!

హను—ఓయీ పిచ్చిపిల్లవాడ!

మ. శతకోట్యర్కమరీచికా సహిత ని ♦ శ్వద్భీకరాటోప లం
ఘితపాథోధి మదీయ రూపమును ♦ వీక్షింపంగనైనన్ సమ
ర్థత నీకింతయు లేదు చూడ ఘన సం ♦ గ్రామంబు నాతోడ నే
గతిసేయంగలవీవు పాపఁడవు నీ ♦ క్రౌర్యంబు జల్లార్చుమా.

లవు—ఓహో హనుమంత! నీరూపము జగద్భీకరమే యగుగాక! నాపట్ల నీప్రతాపమేమియు బనికిరాదు.

హను—వద్దుసుమా ! చెడిపోయెదవు.

లవు—నన్న నీవు బాగుచేయనక్కరలేదు.

ఉ. పాపుల రాక్షసాధముల ♦ బట్టి పలార్చితినంచు భీమహా
రూపముదాల్చి వారధిని ♦ రూఢిగదాటితినంచు గర్వమే
ప్రాపుగబల్కినంతనె దు ♦ రంబునకు న్వెనుదీయజూమ్మి నీ
యేపునడంచివైతు నిలు ♦ మీ ! పవనాత్మజ ! యొక్కకోలచే.

(బాణమును బ్రయోగింప బారిపోవుదురు.)

లవు—రుచికా ! యిక్కడికి వానరమూకకూడ మూర్ఛిల్లినది. చూచితివా ! అదిగో లక్ష్మణుడు కాబోలు వచ్చుచున్నాడు.

లక్ష్మ—(ప్రవేశించి) ఔరా ! ఎంత యాశ్చర్యము.

చ. జగముల దల్లడిల్లునటు ♦ సల్పగజాలు ప్లవంగపుంగవుల్
జగడములోన సోదరులు ♦ జయ్యనకూలిరి బాలుచేత మా
యగ గనుపట్టె నీబుడుత ♦ డా రఘురాముని యాత్మసంభవుం
డగుటకు సందియంబు కల ♦ దా, క్షితి నన్యులకింతయొప్పునే.

ఓయి లవకుమార ! నీవు దూరమాలోచింపక శ్రీరామచంద్రుని సవనాశ్వమును బట్టుటపాడిగాదు. నీవీగుర్రమును విడచితివేని రామునితోజెప్పి యింతకంటె మంచి యశ్వముల బదివేలిప్పించెదను రమ్ము.

లవు—లక్ష్మణ ! నేను దూరమాలోచింపలేదని నీవు నాకు నీతుల గరపుచుంటివా ! చాలుంజాలు, నింతటివాడ వెప్పుడయినాడవు?

చ. అనయముభర్త బ్రోవ జను ♦ మా ! యన నిష్ఠురవాక్యముల్ వచిం
చినదని ముక్కుమూరెడుగ ♦ జేసి ధరాసుతనొంటి కాననం
బున విడనాడి రావణుని ♦ మోమున కర్పణజేసినట్టి ల
క్ష్మణునకు నేడుజ్ఞాన మహి ♦ మంబులభించెనె, యేమి చిత్రమో.

కావున నీవు నాకు బుద్ధులుచెప్పక వచ్చినపని జూచుకొనుము.

లక్ష్మ—లవకుమార ! అది నావలన దోషమే. యెట్టివాడైనను స్వాపరాధము నొప్పుకొనదగినదే ! అది యటుంచుము. రామచంద్రుని పరాక్రమమునైన గణింతువా లేదా !

లవు—ఎట్లు గణింతును. ఆరాముని పరాక్రమము నెరుంగని వారు గణింతురేమో !

లక్ష్మ—(తనలో) అన్నన్నా ! యీబాలుడు తప్పక మాజానకీ దేవి సుతుండగుటకు సందియము లేదు, కాని యీతని కీరహస్యమును నేను వెల్లడింపరాదు. సమరము మానుడు నన్న యజ్ఞఘోటకమును విడువడు. సర్వసేనలును మూర్ఛాసముద్రమున మునింగినవి. నోరెత్తకుండ బ్రత్యుత్తరముల నిచ్చుచున్నాడు.

ఉ. అంకమునందు జేర్చికొని ♦ హాయిగ ముద్దులనాడకుండ నీ
వంకను భ్రాతృపుత్రుని వి ♦ వాద మెలర్పగ బోర గూల్పగా
జంకక వచ్చినాడను నృ ♦ శంసుడ మానుదనన్న నెల్లరక్
శంకదొలంగి కూల్చె నెటు ♦ సల్పుదుదైవము ! తోచదేమియున్.

(ప్రకాశముగ ! వత్సా ! లవకుమార ! నామాట విని యీ యశ్వమును విడువుము.

లవు—లక్ష్మణ ! తప్పక నీకీయశ్వమే కావలసినయెడల నేను చెప్పినట్లు చేయుడు.

లక్ష్మ—ఎట్లు ?

లవు—

గీ. వాజి ముఖపత్రమును జించి ♦ వైవవలయు
నెప్పు డీవిధమున లిఖి ♦ యింపమనుడు
నీకు నోడితిననవలె ♦ లోకమెఱుగ
నట్లుచేసిన గొంపోవు ♦ డశ్వమిపుడు.

లక్ష్మ—ఇకసమరముతప్పదు దయారసమునకు బాత్రుడుకాడు. ఓకుర్రా ! ఆశౌర్యనిధియైన రామునితో నీకు వైరము తగదుసుమి !

లవు—ఆరామునిశౌర్య మేవిషయముననో చెప్పెద వినుము.

గీ. రాము పౌరుషంబు ♦ రామయా సీతను
వనులకనుపబనికి ♦ వచ్చుగాని

సంగరమున నన్ను ♦ సమయింపజాలను
నిశ్చయముగ నమ్మ ♦ నెమ్మనమున.

లక్ష్మ—ఓరీ! అర్భక! నిన్ను గెల్చుటకు రాముడు కూడ గావలయునా?

గీ. పశుల దోలినరీతి సు ♦ పర్వకోటి
జెలగి చెండాడిన మ ♦ హేంద్ర జిత్తుగూల్చి
నట్టి లక్ష్మణుడను నన్ను ♦ నాహవమున
గెలిచి యుండినకద, రాము ♦ గలనగనుట.

లవు—ఓయీ లక్ష్మణ!

గీ. శూర్పణఖ ముక్కు గోయగ ♦ శూరవరుడ
వీవు, రావణుశక్తిని ♦ న్నావిధమున
మూర్ఛనొంపగ మారుతి ♦ మూలముననె
బ్రతికితివి లేకయున్న నీ ♦ పాట్లు తెలియు.

లక్ష్మ—అట్లయిన గాచికొనుము. (బాణముల విడుచును.)

లవు—(బాణము వేయ లక్ష్మణుడు మూర్ఛిల్లును.) రుచికా యీ లక్ష్మణుడుకూడ మూర్ఛిల్లినాడు. రాముడు వచ్చువరకు మనము కొంత విశ్రాంతినొందవచ్చును.

లక్ష్మ—(లేచి) ఓహో! లవకుమార పారిపోకుము. రమ్మ యుద్ధమునకు.

లవు—ఓయీ లక్ష్మణ, మరల బ్రతికితివా? అటులైన రమ్ము.

లక్ష్మ—(తనలో) ఈశౌర్యరాశి బ్రహ్మాస్త్రమునగాని లొంగడు
(బ్రహ్మాస్త్రము విడుచును.)

లవు—(మూర్ఛిల్లును.)

రుచి—అయ్యో! కొంపమునిగినది. యీవార్త మాపావనీదేవి తో జెప్పెదనుగాక. (నిష్క్రమించును.)

లక్ష్మ—హా కుమార! (సమీపించి)

గీ. మంకుపట్టుపట్టి ♦ మామాట వినవైతి
వకట పుత్త్ర మూర్ఛ ♦ నందినావె
నిన్ను గన్నతల్లి ♦ నీపాటు దిలకించి
యెంతయేడ్వగలదొ ♦ వంతచేత.

హా! వీరకేసరికిశోరమ! నీయట్టి దుడుకుగల పసికూనలతో నావంటివానికి రణమా? హా! అన్యాయముకదా! ఓసైనికులార! నేనీ కుమారున కిట్టి పాటొనరించితినని మాయన్నగారికి దెలుపుడు. నేనీ వీరకుమారుని గనిపెట్టుకొని యుండెదను. (తెరపడును.)

## 2 రంగము—వాల్మీకాశ్రమము.

సీత—అక్కటా! నాయెడమకన్ను దురుచున్నది. అడవిలో నా నాధుండు రామచంద్రుడు విడిచిన హయమేధవాజిని నాకుమారుడు లవుడు గట్టివేసి వారిసైన్యములనెల్ల మూర్ఛలో ముంచివేసినాడట. అయ్యయ్యో! ప్రాచేతసుండు సముఖమున నుండకపోవుటచే నెంత యవస్థ సంభవించినది? హా దైవమా! యింకేదిదిక్కు. కుశకుమారుం డెందఱిగెనో కదా?

కుశు—(హఠాత్తుగ బ్రవేశించి) అమ్మా! ధనువు. ధనువు.

సీత—అదేమిరా నాయనా!

గీ. సవనహయమును బంధించి ♦ శౌర్యమునను
రామసేనల లవుడు సం ♦ గ్రామమునను
మూర్ఛనొందించెనను కోవ ♦ మునను లక్ష్మ
ణుండు తమ్ముని మూర్ఛిల్ల ♦ నొంచెనంట.

సీత—హా లవకుమార! (మూర్ఛిల్లును.)

కుశు—తల్లీ! భయములేదు లెమ్ములెమ్ము. నామాటలవినుము

సీత—(లేచి) ఏమి చెప్పెదవురా నాయనా!

కుశు—

చ. జగములు మూడునుంగలసి ♦ సంగరరంగమునందు నిల్చినన్
బెగడుపడంగ లోకములు ♦ భీకరశస్త్ర చటచ్చటాగ్నిచే
దగులు వడంగజేసెదను ♦ తమ్ముని దెచ్చెద నింతలోననే
పొగులకుమమ్మ సద్గురుని ♦ పూజలు విద్యలు రిత్తవోవునే.

సీత—నాయనా! అట్లు దండనోపాయమునుమాని ప్రశాంత చిత్తుడవై నాతమ్ముడెఱుంగక యిట్లుచేసినాడని లక్ష్మణాదులతో జెప్పి వారి గుర్రమును విడిచి తమ్ముని దోడ్కొనిరమ్ము. ఇది ప్రమాద రహితమైన మార్గము. నామాట వినుము.

కుశు—అమ్మా! యీకుశలవు లంతపరాక్రమ హీనులను కొంటివా! వారికి దోసిలియొగ్గుటకు? నేను వీరపక్షముననే యవలంబించి వారలనెల్ల నోడించి హాయముతో దమ్ముని త్రోడితెచ్చెదను.

సీత—నాయనా! నామున్ను చెల్లింపవోయి ఆరామచంద్రునిపై హరిహరాదులైన గత్తి కట్టలేరుకదా!

కుశు—ఇపుడు సవనహయముతో దమ్ముని త్రోడితెచ్చెదను.

ఉ. అప్పుడు రామచంద్రుడు ని ♦ జాప్త సహోదరవర్గ మాజిలో
ముప్పున జిక్కజూచి మము ♦ ముట్టడివేయగ నీదుచెంతకున్
జప్పుననచ్చు నీవు కృప ♦ సల్పితురంగ మొసంగుమమ్మ మే
మొప్పకయున్న దండనకు ♦ నోర్తుము నన్నిపుడంపు మమ్మరో.

మఱియు నీవొక యంగరక్ష దయచేసితివేని దానిని నాతమ్మునకుగట్టి మూర్ఛనుండి మరలించెదను.

సీత—బిడ్డా! అటులే యిచ్చెద. (రక్షఘటించి) కుశకుమార! నేనే నిశ్చయమైన పతివ్రతనైతినేని యీరక్షను స్పృశించినంతనే లవ కుమారుడు మూర్ఛనుండి తొలంగుగాక! (ఇచ్చును.)

కుశు—అమ్మా! నాకు శలవొసంగుము. దీవించుము.

సీత—వత్సా! విజయమును పొందుదువుగాక.

కుశు—(నిష్క్రమించును.)

సీత—అక్కటా! ఎంతపని జరిగినది ?

గీ. లక్ష్మణుడు తానె నను కాన ♦ లనుద్యజించె
నన్ను పోలికనున్న యీ ♦ చిన్నికుఱ్ఱ
గాంచి నాపుత్త్రుడనుచు యో ♦ జించలేదొ
యెటిగియేయిట్లు చేసెనో ♦ కరుణలేక.

హా వనదైవతములారా !

సీ. విపినదేవతలార ♦ వే వచ్చి బ్రోవరే
లలిత శౌర్యోదారు ♦ లవకుమారు
దయజూపి మనుపరే ♦ తాపసేంద్రములార !
లలితశౌర్యోదారు ♦ లవకుమారు
ఆదరింపరె మీరు ♦ లందఱు తరులార
లలితశౌర్యోదారు ♦ లవకుమారు
బ్రతికింపరే నాను ♦ కృత సంచయములార
లలితశౌర్యోదారు ♦ లవకుమారు

గీ. పంచభూతములార, ర ♦ క్షించలేరె,
లలితశౌర్యవిలాసు నా ♦ లవకుమారు
రక్షణము సేయరే నవ ♦ గ్రహములార
లలితశౌర్యవిలాసు నా ♦ లవకుమారు.

ఓ త్రింశత్కోటి దేవతలార ! నాశపథ మిదే యాలింపుడు.

గీ. ఏని నిజమా పతివ్రత ♦ నేని రామ
చంద్రు పదభక్తిగలిగిన ♦ సాధ్వినేని
రహినొసంగిన నాయంగ ♦ రక్షవలన
మాలవుడు మూర్ఛ మునుగక ♦ మసలుగాక.

అయినను తండ్రులతో గొడుకులకగు రణవార్తను ప్రాచేతస మునీంద్రులకు నంపింపెదను. (నిష్క్రమించును.)

## 3 రంగము—అడవి.

(మూర్ఛిల్లిన లవునితో లక్ష్మణుడు ప్రవేశించును.)

లక్ష్మ—అక్కటా ! దైవనిర్ణయమెట్లు పరిణమించినదో.

గీ. విసనహింపని నడిచేత ♦ జనకజాత
నడవి విడనాడినందున ♦ నా మెసుతుని
గారవించెడు భాగ్యంబు ♦ కలుగదయ్యె
మొండినై పుత్రకునిమూర్ఛ ♦ మునపవలసె.

ఏమిసేయుదును ! జన్నంపు గుర్రమును విడువుమని యెంతప్రతి మాలినను విడునడయ్యె ఎట్లు విడుచును.

గీ. శౌర్యసాగరుడౌ రామ ♦ చంద్రసుతుడు
జనకజా గర్భవారిధి ♦ చంద్రుడితడు
పరుల వీరోక్తిసైచునే ♦ పరువుమాలి
పోటువడి సింగపుంబిల్ల ♦ బొబ్బలిడదె.

(తెరలో) హా దురాత్మ ! లక్ష్మణ !

లక్ష్మ—(అదరిపడిలేచి) అల్లదే కుశకుమారుడు కాబోలు ప్రళయకాల భైరవానుకారియై వచ్చుచున్నాడు.

కుశు—(ప్రవేశించి)

ఉ. పోకుము పోకుమెచ్చటికి ♦ బోయెదవో రఘురాముతమ్ముడా
యీ కుసుమాంగు నీ లవుని ♦ నేడ్తెర మూర్ఛలజేసినంతనే
చేకురునే జయంబు జయ ♦ శీలత మీ కులమెల్ల నేడె చీ.
కాకుపడంగ జేయుటకు ♦ గా, కుశు డుండెనటం చెరుంగవే !

లక్ష్మ—కుశకుమార, ఏలయాగ్రహించెదవు. నీతమ్మునిపాటు చూచికొనుము.

కుశు—నాతమ్ముని పాటునకేమికాని నీపాటిప్పుడు చూచికొనుము. (తమ్ముని జేరి)

కం. మాతల్లియేపతివ్రత
యై తనరిన నంగరక్ష ♦ నంటినకతనన్
మాతమ్ముం డిపుడు లేచెడు
గాత మహామూర్ఛనుండి ♦ కడిమి మెఱయఁగన్.

(అంగరక్ష లవునకి గట్టును, లవుడులేచి ధనువుబట్టుకొని)

గీ. పారిపోకుము లక్ష్మణా ♦ ఖండనమున
మూర్ఛనొందితివనినీకు ♦ ముదమదేల
యిపుడె నీదగు దోశ్శక్తి ♦ నెల్లమాయ
జేసి మీవారితోడ మూ ♦ ర్ఛిల్లజేతు.

కుశు—తమ్ముఁడా ! లేచితివా !

లవు—అన్నయ్యా ! వచ్చితివా ! (కౌగిలించుకొందురు.)

కుశు—తమ్ముఁడా ! వీరుతో నీకువైరమేల కలిగెనురా?

లవు—అన్నయ్యా ! యీయశ్వఫాలమునందలి పత్రమును జూచిన నెవ్వరైన నూరకుందురా !

గీ. రాముఁడే శూరుడంట యీ ♦ భూమియందు
అతనితల్లియె ధర పతి ♦ వ్రతయగునట
యెవని జనయిత్రి సాధ్వియై ♦ యెసగలేదు
యిట్టిమాటల సహియించు ♦ టెట్టులన్న
అందుచే నీసవనాశ్వమునుబట్టితిని.

కుశు—తమ్ముఁడా ! మంచిపనిచేసితివోయి.

లక్ష్మ—కుశకుమార ! కొంచెము పెద్దవైనందులకు బాగుగ యోజింపుము. మీకును బౌరుషముండవచ్చునుగాని యుక్తాయుక్తము సరయుము.

గీ. అసురులనుజంపి భూభార ♦ మడపివేయ
నవతరించిన శ్రీహరి ♦ యనగబరగు

రామచంద్రుని విపుల ♦ పరాక్రమాగ్ని
రగులుకొనజేసి బ్రతుకుడు ♦ రా ధరిత్రి.

కుశు—లక్ష్మణస్వామి! రామాయణమెల్ల నామూలాగ్రముగ జదివిన మాకు రాముని ప్రభావము తెలియకపోలేదు.

సీ. పడతిచావగనున్న ♦ బడుగుచాటక నొక్క
శరమునగూల్చిన ♦ సాహసంబు
ప్రాతదై చివికిన ♦ భర్గునిచాపంబు
బొడిచేసిమించిన ♦ భుజబలంబు
పరునితో బోరడు ♦ తరి జెట్టుచాటున
బొంచి వాలినిగూల్చి ♦ మించుశక్తి
తెలిసికోలేక కో ♦ తులచెల్మిచే సీత
జాడను గనుగొన్న ♦ జాణతనము

గీ. నాగపాశమునను మేను ♦ నవయుచుండ
నిజముగ ఖగేంద్రుడే కరు ♦ ణింపకున్న
రామలక్ష్మణ వీర వి ♦ క్రమమదెల్ల
లోకము లెరుంగకుండునే ♦ రాకుమార.

లక్ష్మ—(తనలో) అక్కటా! యీకుశునిమాటలకు బ్రత్యుత్తర మీయజాలకున్నానుగదా! చెలికారమునకై యెంత ప్రయత్నించినను సాగదయ్యె. (ప్రకాశముగ) వత్సలార! ఆయాకార్యములకు గొన్ని కారణములుండుటచే నట్లు జరిగినవికాని యీమహాత్మునిపరాక్రమమును నీవు విమర్శింపలేదు.

కుశు—విమర్శింపకపోలేము.

గీ. రాము డసమానమైన ♦ పరాక్రమమున
పరగువాడని యెరుగుదు ♦ బరమసాధ్వి
సీతదుఃఖాగ్ని దగ్ధమై ♦ చివరకామె
యశ్రుధారలరూపటి ♦ యంతరించె.

లక్ష్మ—(తనలో) యీమాటలచే నాకు శోకము హెచ్చగుచున్నది.

కుశు—తమ్ముడా! లవకుమార! లక్ష్మణుడు శేషాంశచేజనించినాడనికదా మనము రామాయణములో చదివినాము

లవు—అవును నిజమే.

కుశు—అందుచే నీలక్ష్మణుని గరుడాస్త్రముచే కూల్చెదను.

లక్ష్మ—వత్సా! ఇక సమరము తప్పదా?

కుశు—తప్పదు.

లక్ష్మ—ఈనామాట నొక్కటాలింపుడు.

ఉ. రామునుయంకపీఠిక ని ♦ రంతరముల్ మిముబాదుకొల్పి స
ప్రేమను మీాయభీష్టము ల ♦ భింపగజేసెద నిశ్చయంబు సం
గ్రామ మదేల యజ్ఞతుర ♦ గంబడి యేల సమస్తరాజ్య ల
క్ష్మీముకుటంబు మీావశము ♦ జేసెద నావెనువెంట రాదగున్.

కుశు—మాంకవేమియు నవసరములేదు. మాకీయజ్ఞఘోటకమే కావలయును.

లక్ష్మ—అటులైన సమరమే కర్తవ్యమా!

లవు—ఆ! సందియములేదు.

లక్ష్మ—అట్లయిన గాచికొనుడు.

కుశు—ఇదిగో (గరుడాస్త్రము ప్రయోగించును.)

లక్ష్మ—హా! రామచంద్ర! (మూర్ఛనొందును.)

లవు—అన్నయ్యా! ఊర్మిళాజాని మూర్ఛిల్లినాడు. రామదీక్షితు డికరావలసియున్నది.

కుశు—ఇదిగో దీక్షితులువారు వచ్చుచున్నారు.

రాము—(ప్రవేశించి) అక్కటా! యీబాలురచేత మనకులమున కకాలప్రళయము సంప్రాప్తమయినదికదా!

చ. సమరధురీణులైన యను ♦ జన్ములు మువ్వురు సర్వసేనలున్
క్రమముగ నీకుమారుల ప ♦ రాక్రమవృత్తికి మూర్ఛనందెయా

గమునకు దీక్షితుండనయి ♦ క్రన్నన నేన రణంబుసేయగా
సమయముదారసిల్లె విధి ♦ చైదములేమనవచ్చు నీశ్వరా.

యీకుమారుల వైఖరిచూడ నా ప్రాణేశ్వరి పై దేహిబిడ్డలని తోచుచున్నది. నాబిడ్డలేకాకపోయిన వీరికిట్టి ప్రతాపము కలుగునా? పుత్రులేయగుగాక! స్థిరపడువరకును.

సీ. సుతులార రమ్మని ♦ యతిమోదమున గౌగి
లించి ప్రేముడిని లా ♦ లించరాదు
గాదిలిబిడ్డలా ♦ రా దరిరమ్మని
యతి ప్రేమున ముద్దు ♦ లాడరాదు
అంకపీఠికజేర్చి ♦ యలకలదువ్వుచు
శిరములాఘ్రాణంబు ♦ సేయరాదు
బాలఖేలనముల ♦ బలుమారు చూచుచు
నానందమున నోల ♦ లాడరాదు
గీ. పుత్రులవిలాసములజూచి ♦ పొంగకుండ
గటగటా! చెడ్డరవ్వాయె ♦ కృ_డుజనించె
నేమిసేయుదు పైపెచ్చు ♦ హితములేక
కన్నబిడ్డలపై గత్తి ♦ కట్టవలసె

(ప్రకాశముగ) ఓవీరకుమారులార! ధర్మాధికారమున మహాఋషులచే నియోగింపబడిన నాతోఁ గత్తికట్టుట మీవంటి ద్విజబాలురకు ధర్మమా?

కుశు—ఆర్యా! పౌరుషముకల్గినవారేని యీసవనాశ్వమును బట్టుడని పట్టము వ్రాసి తురంగముఖమున గట్టుటమీకు ధర్మమా?

రాము—ధర్మమే! యిది యజ్ఞాశ్వము.

కుశు—పౌరుషవంతులము కనుకనే పట్టితిమి.

రాము—మీరుమొదల సాపరాధులైనారు యేమందురా?

గీ. తొలుత బంగారుతమ్ముల ♦ దొంగిలిటయు
బిదప సవనాశ్వముబట్టి ♦ వదలకుంట

తాపసులవృత్తిజరియించు ♦ ధర్మపరుల
కెంతయునునింద్యములుకావె ♦ యెంచిచూడ.

కుశు—పూజ్యుడ ! అయ్యది నింద్యముకాదు.

గీ. భుజబలిమిజూపి బంగారు ♦ పూలగోనియె
శౌర్యమున యజ్ఞతురగంబు ♦ సరగబట్టె
కాని మావాడు తెక్కలి ♦ కానికరణి
చాటుపనిసేయ మీచెంత ♦ జదువవలయు.

రాము—నేను చెట్టుచాటుననుండి వాలినిగూల్చుట నుపాలంభించుచున్నాడు. (ప్రకాశముగ) వత్సలార ! నావద్దనటులే చదువుకొనవచ్చును. గుఱ్ఱమును విడువుడు.

లవు—విడువము.

రాము—మీరు పసిబాలురగుటచే మిక్కలి చెప్పుచున్నాను. నాపౌరుషప్రభావమును మీరెఱుంగరు తురగమును విడువుడు.

కుశు—ఓమాయానాటక సూత్రధారీ !

గీ. ఆడువారిబట్టి ♦ యడవులకంపెడు
పట్ల మీడుశక్తి ♦ పనికివచ్చు
నట్టిమీ ప్రతాప ♦ మవనిజదుఃఖాగ్ని
దగులువడి హరించె ♦ ధరణినాథ.

రాము—హాపరమేశ్వర ! (మూర్ఛిల్లును.)

లవు—అన్నయ్యా ! మహారాజు మూలము దెగిన మందావృక్షమువలె మాటచేతనే కూలినాడురా !

కుశు—తమ్ముడా ! స్వయంకృతాపరాధము మనస్తాపకరము కాదా ? మహారాజా ! శ్రీరామమూర్తీ ! లెమ్ము లెమ్ము. వీరరస సమయమున కరుణారసము జూపరాదు.

రాము—(లేచి) హావీరకుమారులారా! నేను సర్వవిధముల వ్యర్థుడను.

కుశు—మావలన సార్థక్యమును బొందెదవులే.

రాము—సత్యము. సత్యము. మీవలన నేసార్థక్యముబొందగలను.

లవు—అట్లయిన సమరోన్ముఖుడవు కమ్ము.

రాము—అక్కటా!

ఉ. చేతులురావు పిల్లలను ♦ చెండగ భీకర శస్త్రసంహతిన్
భ్రాతలు మిత్రులాగతిని ♦ భండనరంగమునందుగూలె నా
చేతము మండజొచ్చె రణ ♦ సీమకు నెట్టులసిద్ధమాదు న
య్యో తలవ్రాతనీగతి న ♦ యోగ్యునిగా లిఖయించితే విధీ!

కుశు—మహారాజ! సవనాశ్వ ముఖపట్టణమున వీరపతివ్రతయైన కౌసల్యాదేవి పుత్రుడనని పౌరుషము గలిగినవాడైన బట్టుడనియు వ్రాసితిరే!

క. మీతల్లియే పతివ్రత
యై తనరెనె! ధాత్రిలోన ♦ నన్యులులేరే
మాతల్లి పతివ్రతయై
భూతలమున వెలయలేదె! ♦ భూమీశమణీ.

రాము—వత్సలార! మీతల్లిపనువ్రతయని త్రికరణశుద్ధిగ నేను జెప్పగలను. కాని లోకమున, కాదుకాదు; యీపాపపులోకమున నట్టి సత్కీర్తి వెలయుటకు నేను దైవమును ప్రార్థించుచున్నాను.

కుశు—మాతల్లిని వీరపతివ్రతకాదనిన యీపాడులోకములను భస్మీపటలముగ జేయగ యూరకుందుమా!

రాము—తథాస్తు. నీమనోరథము లీడేరుగాక.

లవు—ఈయాశీర్వచనములకేమిగాని యిక రణమున కుద్యమించుము.

రాము—బాలకులార! మిమ్ముల ముందుగొట్టగ నాచేతులాడవు. మీరే ముందుగ నన్ను గొట్టుడు.

కుశు—అట్లయిన నిదే కాచికొనుము.

(బాణముల ప్రయోగించును)

రాము—అక్కటా! యీబాణము లెంత చురుకుగ నాటినవి.
(బాణమును విడుచును కుశుని కంఠమునకు బూలమాలిక యగును.)

లవు—వహావ్వా! రామచంద్ర! నీవు జయించితివని మాయ న్నకు గంఠమున బుష్పమాలికను వేసితివా?

రాము—లవకుమార! నిన్నును నావిధముగానే బహూకరించెదను. (బాణమును విడువ బుష్పమాల యగును.)

లవ—బలే. రామచంద్ర! మమ్మిరువుర నీసామ్రాజ్యమునకు బట్టభద్రుల జేసితివా?

రాము—వత్సలార? నాకంత యదృష్టము కలుగునా?

కుశు—మహారాజ! యెందులకీ చప్పిడి కోలలు. తీవ్రమైన మహాస్త్రమేదో ప్రయోగింపుము.

రాము—(తనలో)

గీ. జగముల వడంకజేయగా ♦ జాలునాదు
బాణ మీపిల్లలకుసుమ ♦ బంధమయ్యె
గాన నాపుత్రులగుట ని ♦ క్కంబు వీరు
బయలుపడి కౌగలింప ♦ భావ్యంబుకాదు.

పై పెచ్చు మహాస్త్రమును బ్రయోగింపుమని హెచ్చరించుచున్నారు. అట్లు సేయుటకు మనసొప్పదు. అక్కటా! ఏమిసేయుదును అయిన నీమహాస్త్రము విడచెదను. (బాణమును విడచును.)

కుశు—తమ్ముడా! యీమహారాజు ప్రేమ లతాబద్ధుడైమనల నొప్పింపలేకున్నవాడు. నేనేయొక్క మహాస్త్రమును బ్రయోగించి మూర్ఛపుచ్చెదను. (బాణమును సంధించి) ఓమహారాజ! రామచంద్ర! మీతల్లి వీరపతివ్రత యని లోకము పొగడవలెనని కదా నన్నింతకు మున్ను పల్కితివి. ఇదిగో యిపుడు నాతల్లియొక్క పతివ్రతా మాహాత్మ్యమున నొక్కబాణమును బ్రయోగించి నీకు జూపెదనుగాక!

రాము—హా మనోహారిణీ! రామమయజీవితాసీతా!

సీ. బాహుబలంబున ♦ భవునికోదండంబు
విరచుటదెల్ల నీ ♦ కొరకుగాదె
కపిరాజుతో జెల్మి ♦ గావించుకొన్నది
కువలయనేత్ర నీ ♦ కొరకుగాదె
చెట్టుచాటున బొంచి ♦ కపీంద్రువాలిని
గోలకూల్చుటయు నీ ♦ కొరకుగాదె
కడలి క్షోభింపంగ ♦ గట్టుకట్టుటయెల్ల
సరసిజనేత్ర నీ ♦ కొరకుగాదె

గీ. దశవదనుజంపి బ్రహ్మహ ♦ త్యకునుసిద్ధ
పడుట నీకొరకగుగాదె! ♦ పుడమిపట్టి
యాకృతులనెల్ల దలపక ♦ యేదొచిన్న
తప్పుచేసితినని బాయు ♦ దగునె సీతా.

అయ్యో! ఈవియోగ వైక్లబ్యము నే నెట్లు భరింపగలను. (ఆకసమువంకజూచి) ఆయేమి! యింకను నాభార్యనునాకనులబెట్టకున్న దికదా! యీవసుంధర! కానీ సముద్రబంధనముజేసిరావణాదులసంహ రించిన నాకేది దుర్ఘటమో చూచెదనుగాక!

ఉ నాదగు భాగ్యలక్ష్మిని న ♦ నంతగుణాలయసీతదెచ్చి మ
ర్యాదగ ధాత్రి నాపదము ♦ లందు సమర్పణసెయకున్న గ
ర్వాదకులంబు మాడ్చినక్రి ♦ యన్ నిశితాశుగ పంక్తిగాల్చి నే
బూదినొనర్తు నీభువన ♦ ముల్ వడి తల్లడమందు నట్లుగాన్.

బాణము నెక్కుపెట్టును.

(బ్రహ్మ యీశ్వరుడు ప్రవేశింతురు.)

యీశ్వ—రామచంద్ర! శాంతింపుము. శాంతింపుము. అల్లదే వసుంధరాదేవి నీభార్యను సీతనుదెచ్చి సమర్పించుచున్నది.

(సీత మరల బైటకువచ్చును.)

బ్రహ్మ—రామచంద్ర ! నీవు నారాయణాంశ సంభూతుడవు. ఈసీత భువనపావని లక్ష్మి. నీవు తొల్లి భృగుపత్ని నివధించుటచే మీకిరువురకు నీవియోగము సంప్రాప్తమయినది. అందులకు గారణమయి యీయపవాద పొడమినది. కాని యీమెయెడల నేదోషమును లేదు యేలుకొనుము.

రాము—ఓహార బ్రహ్మలార ! వందనములు సేయుచున్నాడను. దేవీ ! జానకీ నీశోకమునుమానుము. దివ్యుల యనుమతినిస్వీకరించితిని.

సీత—మహాప్రసాదము. (నమస్కరించును.)

కుశ, లవు—జనకా ! అభివందనము లాచరించుచున్నాము. దివ్యులార ! నమస్కారములు.

రాము—వత్సలార ! రవికులపరాక్రమము నిల్పిన మీరుచిరంజీవులై వర్ధిల్లుదురుగాక.

ఈశ్వ—రామచంద్ర ! నీకింక నేమికావలయును.

రాము—మహాత్ములార ! మీకృపవలన ధరిత్రిమీద నపవాద తొలంగి నాభార్యను నాపుత్రులను చేకొనగల్గితిని. అయిన నిట్లగుగాక.

గీ. లేమ లపవాద లేశంబు ♦ లేకయుండ
క్షితి పతివ్రతలౌచును ♦ చెలగుగాత
సత్కవి విధేయ మాణిక్య ♦ శర్మకృతులు
విపుల ధర్మాంచితంబులై ♦ వెలయుగాక.

ఇది శ్రీకాశ్యపసగోత్ర సంభవ నారసింహార్య తనూభవ నర్సమాంబా
గర్భశుక్తి ముక్తాఫల కాశీచయనుల రామకవి గురుకరు
ణాలబ్ధ సాహిత్యమాణిక్యశర్మ ప్రణీతంబైన
లవకుశ నాటకము సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ



# లవకుశలోని సాంగ్సు



(1) సాంగు—సీతారాముల ప్రణయవాదము. భైరవి—ఏక.

రాము— ఇంతకే యింతకోపామటే
కాంతరో యేలుకోరాదటే ॥ఇంత॥

సీత—చాలుచాలింక మీాస్నేహము రామ
చంద్ర ? తెల్లమయ్యెగా ॥చాలు॥

రాము—మాటలలో నుప- మానించినందుకె
బోటీ కోపాగింపబోలూనె యేలు ॥మింత॥

సీత—తలపరానట్టి ఆ - దశకంఠుని పేరు
తలచినన్నుడికింప - దగునే నాథా ॥చాలు॥

రాము— సకియ, ఎట్లానోరు - జారితి క్షమియింపు
గికురింప కేనాడు - కేళ్లోని యేలు ॥మింత కేయింత॥

(2) సాంగు—రాముడు సీతాపవాదకై తపియించుట.

వసంతరాగము—రూపకము.

1 కాలగతివక్రమై - క్రాలదాటగనౌనె ॥కాల॥
యేలీలసహియింతు - నీవియోగభరంబు ॥కాల॥

2 సురలు పూవులవాన - గురియ నగ్నింజొచ్చి
పరిశుద్ధిగనినట్టి భవ్యాత్మ సీతకును
ధరణిలో నపవాద దారసిల్లగ నన్య
తరుణుల కికేవారి - దైవమా నేడు ॥కాల॥

3 కలుషాత్మురాలనుచు నిలలోన నపవాద
మలయు నేనెట్లెలవలయు నీజానకిని
కలుషంబడుగుదాక - గానలకు బంపింతు
కటాకటావిరహాగ్ని - గనలిచావనొకో ॥కాల॥

(౩) సాంగు- లక్ష్మణుడు రాముని విచారకారణమడుగుట-శహాన-ఆట.

లక్ష్మ—అన్నా విన్నదనమదేలయన్నా - తెల్పుమన్నా
అఖిలదనుజ విరామ గుణసంపన్నా

రాము—జనకసుత రావ - ణుని సన్నిధిని బెక్కు
దినములు వసియించెనంట - అందున పాపియంట
విడువక యేలితినంట కీర్తికి భంగమంట
నేనెట్లుసైచెద నీపెనుమంట - యేమియునుదోచకయె పిలిచితి-
అయ్యా యేమాని చెప్పుదునయ్యా - వినుమయ్యా-
గిరిశిఖరమూడి తలపై బడెనయ్యా.

లక్ష్మ—అనలమున ద్రోసి పరిశుద్ధ - యనిపింపలేదా !
సురలుపొగడలేదా - సుమములు గురియలేదా !
దిక్కులుపొగడలేదా - పలుగులు వినగలేదా !
కూళపలుకులుధర్మవాక్కులె ॥అన్నా॥

(4) సాంగు-లక్ష్మణుడు సీతను విడువలేననుట-డైలాగు నవరోజు.ఆది.

లక్ష్మ—విడువాజాలా - పుడమీపట్టీ
అడవులందూ - అన్నావినుమా ॥విడు॥

రాము—తమ్ముడా శో - కమ్మూమాను
కొమ్మావిడచీ - రమ్మావేగా ॥తమ్మా॥

లక్ష్మ—పూతాచరితా - సీతవిడువా
ఖ్యాతియేనా - భూతలేశా ॥విడు॥

రాము—అపవాదామూ - అడగుదాకా
తప్పదయ్యా.- తరుణిన్ విడువా ॥తమ్మా॥

(5) సాంగు—సీతను విడచుటకై లక్ష్మణుడు తపించుట.

ఫీలువరాగము— రూపకము

1 అకట లోకమాత సీత - నడవినెట్లు విడచువాడ
అయ్యోనా ప్రారబ్ధమొ - అవనిజాతపాపమో ॥ అక॥

2 పాడులోక మాడుకూతల - పాడిచేసి పుణ్యచరిత
కీడెంచక నడవుల విడ - నాడనన్ను బంపుచుండె ॥అక॥

3 రావణుచే జావకుండ - జీవించితి నిందుకొరకె
దైవమా యీలోకమాత దారుణగతి శిక్షింతునె॥ అక॥

(6) సాంగు—సీత లక్ష్మణుని విచారకారణమడుగుట—ద్వైలాగు.

కాంభోజిరాగము...ఆటతాళము.

సీత—అన్నా లక్ష్మణ ! యిదియేమన్నా !
చింతిల్లెద । వన్నా సంగతిదెల్పుమా !
అదియేమోకాని బ । యలుదేరినదిమొద
లపశకునములేయయ్యె । గుండెలుద్రయ్యలయ్యె
చయ్యనన్ రధశీలవిరిగెను । సత్వధంబావురులు క్రమ్మెను
నెయ్యమింతయు దోపదక్కట । నీమొగమునందేమిపాపమొ॥

లక్ష్మ—ప్రారబ్ధకర్మతప్పగనేరితరమని భావమందుననెంచితి దర్కించితి॥
అంచితమ్ముగ జీవకోటి ప్ర । పంచసౌఖ్యమె నిత్యమని భా
వించి రాగలకష్టములమది । నెంచకుందురుతల్లి ! యజ్ఞత॥ ప్రా॥

(7) సాంగు...సీత నిజాపవాదనుగురించి లక్ష్మణునితో జెప్పుట.

భైరవిరాగము—త్రిపుట.

1. ఎరుగవేలక్ష్మణా । నావృత్తాంతమెల్ల॥ యెరు॥
యెరుగాదే యీలోకమెల్ల । సురులువొగడశిఖజొచ్చిటెల్లనునాడు

2. సీతచే పవిత్రుడానైతినని యా । వీతిహోత్రుడెపల్కలేదే॥
పాతకీనంచు బల్లూలాడ । నీతియేమన్విడనాడావనములను॥ యెరు॥

(8) సా. గు—సీత లక్ష్మణుని విడచిపొమ్మనుట—డై లాగు.

సీత—నాతండ్రి లక్ష్మణ । నాఖ్రాతయిటులుండె
నీవేమిచేసెద । విక విడచిపొమ్మా ॥ నా॥

లక్ష్మ—అమ్మరోనిను నీ । యడవిపాలొనరించి
యెమ్మెయిబోవుదు । నెంతపాపుడనో॥ అమ్మ॥

సీత—రామాజ్ఞమీరాగా । రాదూకదాయన్నా
నామీద దయయుంచి । ననుదలపుమయ్యా॥ నా॥

లక్ష్మ—తల్లిరోయపవాద । తగినపుత్రునిగని
వల్లభునరి సౌఖ్యపడెదవోయమ్మా॥ అమ్మా॥

(9) సాంగు—సీత యడవిలో విలపించుట—హిందుస్తానీతోడి.

1. హావనదేవతలార । ఆదరింపరా॥ హావ॥
ఆరడిపాలయి । ఆవిభుచే విడి
ఘోరవిపినముల గ్రుమ్మరుచుంటిని॥ హావ॥

2. మునునేచేసిన । ఘనపాపంబున
బ్రాణసమానుని । బతినెడబాసితి॥ హావ॥

3. క్రూరమృగములార । గొబ్బుననను మ్రింగి
నాపరితాపము । బాపరెమీరు॥ హావ॥

(10) సాంగు—రాముడు సీతకై శోకించుట. యమునాకళ్యాణి-రూపకం.

1. ఎంతటిపాపుడనైతినో । యింతిబాసితి నపయశమున॥ నెంత॥
కాంత సీతగహనసీమ । నెంతనివిలపించెనోకో॥ యెంత॥

2. మున్నె సతిపతులబాపి । ముచ్చటించితో గర్వమునను॥ నెంత॥
పన్నగ నిపుడట్టిదుర్గతి । ప్రాప్తమయ్యె దోషియనగునె॥ నెంత॥

3. రాముడుకఠినుండటంచు । రవ్వచేసితో జానకి
అమెయికష్టింపలేకే । అసులవిడచెనో దిక్కులేక॥ నెంత॥

### (11) సాంగు—సీత వాల్మీకాశ్రమము—ఆత్మగతవిచారము.

బిలహరిరాగము—రూపకము.

1. దైవమా॥ నాకీయెడ నే । దారిచూపదలచినావో
దైవమా॥ దైవమా॥
కడతునె నేనెన్నడైన । గాంతుని విరహాగ్నిశిఖల
బుడుతలతో నారాముని । పొంతజేరి సుఖయింతునె॥ దైవ॥

2. ఎట్టిటో వాల్మీకికరుణ । నట్టడవిని జానకుండ
బట్టులగాంచితిని రాముని । చెట్టబట్టచేయవే॥ దైవ॥

3. ఏనె మహాసాధ్వినేని । యీనినువుల ప్రాపుచేత
మానితనై యపయశంబు । మాసి పతినిజేరుదాన ॥దైవ॥

### (12) సాంగు—లవుడు సీతతో విచారమేమనుట.

అఠాణారాగము—రూపకము.

లవు—1. మదినివిచారమేమమ్మా । మానక తెల్పగదమ్మా ॥మది॥
యెదిదుర్ఘటకార్యమైన । నిపుడే నేనొనరించెద ॥మది॥

2. భువనమ్ములను జయించియొ । దివి ద్రోసియొ దేనినైన
శ్రమయనకను దెచ్చి కోర్కె । సఫలముగా జేతునమ్మ ॥మది॥

3. భువనంబుల గెల్వజాలు । పుత్రులమిద్దర ముండగ
అవిరళచింతాబ్ధిమునుగ । నర్హమె! వినుపింపుమమ్మ ॥మది॥

### (13) సాంగు—లవుడు సీతతో రాముని జయించుటెంతని పలుకుట.

సురట—రూపకము.

లవు—1. ఇంతమాత్రమునకె నీమది । చింతనొందదగునెతల్లి
వంతమానుము పైడితమ్ములు । నంతముగాదెచ్చియిచ్చెద ॥ఇం॥

త—2. పలుకొక్కటియేచాలుర । పట్టి వేయివరాలగు
అలఘుని రాముని నోర్వగ । హరిహరాదులకువశమే ॥ఇంత॥

వు—3. ఎరుగవునాశక్తి రాము । డింత నాదుమ్రొలకలన
హరిహరులనుగూడినసే । నడచినైతురాముదృటిలో ॥ఇంత॥

త—4. నామాటలవినుమా రఘు । నాథునితో జలగాటమ
యీ మెయిత్వరపడియేగకు । నీరామునితోడ ననికి ॥ఇంత॥

వు—5. రాముని విక్రమము జనక । రాజతనయ కన్నిళ్ళచే
క్షీణించెను వానిగెలిచి । చెచ్చెరకంజముల దెత్తు ॥ఇంత॥

4) సాంగు—రాముడు కుశలవులగాంచి (తనలో)—దర్బారు—ఆట.

1. దైవమా చేర్చువె ! దరికినన్నెప్పుడైన ॥దైవమా॥
యిటువంటికొడుకుల । నెవ్వుడై నగాంచెదనె
కటకట చూలాలిని । కానలపాల్జేసితి ॥దై॥

2. సుతుల వీరినిజూడ । జోద్యమదేమోకాని
మదిలోనదోచె నాకు । మారులవలె నదేమొ ॥దైవ॥

3. అంతటిభాగ్యమున । కర్హుడౌనే రాముడు
హంతకుడానై సతి । నడవినిగల్పినాడ ॥దైవమా॥

(15) సాంగు—లవుడు గుర్రమునుజూచి—కాంభోజి—ఆట.

1. పట్టుడీ మఖఘోటకంబును గట్టుడీ నెచ్చెలులార ॥పట్టుడీ॥
రాముడే ముజ్జగంబులును ప । రాక్రముండట శౌర్యనిధియట
యీమహీస్థలి వేరెయస్యుల । దేమొచూచెదగాక వేగమ ॥ప॥

2. అతని జనయిత్రియె పతివ్రత । యనుచుగర్వోక్తిని లిఖించెను
క్షితినినాతల్లిసాధ్వీత్వ విశేషమును రామునకుజూపెద ॥పట్టు॥

3. రాముడొక్కడె కాదు త్రిపురా। రాతిదివ్యులతోడవచ్చి
భీమరణమున వారినెల్లర। సీచమడచెదనొక్క తృటిలో ॥

(16) సాంగు—చంద్రసేన లవుల డైలాగు.

సింధు కమాచి—ఏకతాళము.

చంద్ర—1 వలదునలదు లవకుమార। వాజబట్టగా ॥మఘవా
వలదు రాముశౌర్యమెన్న। వశముకాదుసూ॥

లవు—2 విడువనేనుపవనహాయము। విడువనుజుమ్మా ॥హాయము
పుడమిబరీక్షింతు రాము। భూరిశౌర్యము ॥రాము

చంద్ర—3 హరిహరాది దివ్యులైన। నతనిగెల్తురే ॥కలననత
చిరుతవీవురామచంద్రు। జెనక దగవుమా ॥రాము

లవు— 4 జనకజకన్నీళ్ళరామ। శౌర్యము వోయె ॥రామశౌ
ననుగెల్వగజాలునె రఘు। నాథుడాజిలో ॥రఘునా



రాజమండ్రి: శ్రీ సత్యానందప్రెస్‌నందు ముద్రింపబడియె—

